

ఐతరేయోపనిషత్తులోని

# సృష్టికథ

(వైజ్ఞానిక వ్యాఖ్య)



కర్త :

డా॥ కోడూరి సుబ్బారావు

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య

ఆర్యసమాజ సంస్థాపకులు

# మహర్షి దయానంద సరస్వతి

(1824-1883)



# ఐతరేయోపనిషత్తులోని

# సృష్టికథ

(వైజ్ఞానిక వ్యాఖ్య)




కర్త :

## డా॥ కోడూరి సుబ్బారావు



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 44
ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ
ప్రతులు : 1000

సృష్టిసంవత్సరము : 197, 29, 49, 108.
విక్రమాబ్దము : 2068.
కలియుగాబ్దము : 5108.
శ్రీ సర్వజిత్‌నామ సంవత్సర దీపావళి
(మహర్షి దయానంద నిర్యాణదినం)

**మూల్యము : రూ. 10=00**
(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, వ్యాస్ వైదిక కళ్యాణ మండపము,
12-10-586/6, మేడిబావి, సీతాఫలమండి,
సికింద్రాబాద్ - 500 061.
2. డా॥ కోదూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి - 508 116.
సెల్ : 9290604641.
3. శ్రీ రావికంటి కృష్ణమూర్తి, బుక్‌సెల్లర్స్,
ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.
4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్.
ఫోన్ : 040-66320200.
5. శ్రీ విద్యా బుక్ డిపో, సుల్తాన్‌బజార్,
ఆర్యసమాజము ఎదురుగా, హైదరాబాద్.
6. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 6632 0300



ఋషిః - నృమేధః
ఛన్దః - విరాడుష్ణిక్

దేవతా - ఇన్ద్రః
స్వరః - ఋషభః

**త్వం హి నః పితా వసో త్వం మాతా**
**శతక్రతో బభూవిథ ।**
**అధా తే సుమ్నమీమహే ॥**

(ఋగ్వేదము. 8-98-11, సామ. 1170, అథర్వ. 10-108-2)

హే వసో ! ఈ చరాచర జగత్తునంతటిని నీయందు వసింపజేసుకొనుచున్న ఓ పరమేశ్వరా ! నీవే మాకు నిజమైన పితవు - యథార్థ పాలకుడవు. హే శతక్రతో ! వివిధ విశిష్టకర్మల కర్తవైన ఓ పరమేశ్వరా ! మా మాతవుకూడా నీవే. తల్లుల గర్భములలో మా కీ శరీరముల నిర్మించియిచ్చువాడవు నీవే కదా ! కనుక, నిన్నే మేము సుమ్న మిమ్మని కోరుచున్నాము - భౌతిక, ఆధ్యాత్మిక శ్రేష్ఠసుఖముల నిమ్మని వేడుకొనుచున్నాము.

ప్రార్థించు
ఒక సుమ్నార్థి,
**కోదూరి సుబ్బారావు**

# తొలి పలుకులు

సుమారు 20 సంవత్సరాల క్రితం సార్వదేశిక్ సభ (ఢిల్లీ) వారిచే ప్రచురింపబడే 'వేదిక్ లైట్' ఆంగ్ల మాస పత్రికలో కొన్ని వైజ్ఞానిక వ్యాసాలు వచ్చేవి. అందులో శ్రీమతి మాయాదేవి M.S. (ఫిజిక్స్), U.S.A. మరియు డా॥ పి.వి. వార్తక్, M.B.B.S. గారి వ్యాసాలు చాలా ఆసక్తికరంగా ఉండేవి. వాటిలో Genesis of Universe A Concept from Aiteraya Upanishad (By Dr. Vartak) గారి వ్యాస ఆధారంగా మరికొన్ని విషయాలు చేర్చి ఈ 'సృష్టికథ' వ్రాసాను. సృష్టిని గురించి మన ప్రాచీన ఋషులలో వివిధ రకాల ఆలోచనలున్నాయి. వాటిలో ఐతరఋషి ఆలోచన వైవిధ్యంగా ఉంది. స్త్రీ గర్భంలో పిండం రూపుదిద్దుకున్నట్లుగా పరమేశ్వరుని గర్భంలో విరాట్‌పిండం రూపుదిద్దుకున్నట్లుగా ఆయన కల్పించి వ్రాసారు. ఇది ఒకరకమైన బోధనాపద్ధతి. మనోరంజకమైన ఒక ఆలంకారిక వర్ణన.

ఇట్టి రచనల వల్ల మన ప్రాచీన ఋషుల మేధస్సు ఎంత పరిణతి చెందినదో అర్థమౌతుంది. ఇటువంటివి చదివితే మన మేధస్సుకూడా పదును పెట్టబడుతుంది. సూక్ష్మవిషయాల నాలోచించగల మేధాశక్తి లభిస్తుంది. తద్వారా ఆత్మ పరమాత్మల వాస్తవిక స్థితిని అర్థం చేసుకుంటాం. ఆ జ్ఞానానికి అనుగుణంగా జీవిస్తే సమస్త బంధనాలనుండి విడివడి పరమానందాన్ని పొందగలుగుతాం. ఉపనిషత్తుల ఆశయం అదే.

ఈ గ్రంథంకూడా వ్యవహార భాషలో వ్రాయ యత్నించాను. కొంతవరకు కుదిరింది. నా రచనలను ఆదరించి చదువుతున్న పాఠకులకు, అభిమానంతో గ్రంథముద్రణకు తోడ్పడుతున్న దాతలకు నా హృదయపూర్వక ధన్యవాదములు. నా గజిబిజి వ్రాతను అర్థంచేసుకుంటూ కంపోజింగ్ చేయుచున్న చి. చకిలం వినోద్ కుమార్ గారికి, అందంగా ముద్రించి యిస్తున్న ప్రింట్‌షాప్ యజమానులకు, కార్యకర్తలకు నా శుభాకాంక్షలు.

విద్వాంసుల, విజ్ఞుల అభిప్రాయాల నాహ్వానిస్తూ...

మీ సేవలో

కోడూరి సుబ్బారావు

ఓ3మ్

# ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ

## (వైజ్ఞానిక వ్యాఖ్య)

నేడు మనం వైజ్ఞానిక యుగంలో ఉన్నాము. విజ్ఞాన సాంకేతిక రంగాలు శరవేగంతో పురోగమిస్తున్నాయి. దానితో ఎన్నెన్నో వింతలు విడ్డూరాలు చూస్తున్నాము. ఊహించని సుఖాలను అనుభవాలను పొందుతున్నాము. వింత విచిత్ర ఆవిష్కారాలతో ఆధునిక మానవుని జీవితం ఆనందంగా గడచిపోతున్నది. అందుకు మనం ఆధునిక ఆవిష్కర్తల నభినందించవలసినదే. వారికి కృతజ్ఞతలు తెలుపవలసినదే.

ఇంతటి ప్రగతిని సాధించినా 'ఈ విశ్వం ఏ విధంగా సృజింపబడింది ?' అనే ప్రశ్నకు ఆధునిక విజ్ఞానంలో నింతవరకు స్పష్టమైన సమాధానం లేదు. విశ్వ సృష్టిని గురించి ఎన్నెన్నో సిద్ధాంతాలు పుట్టుకొస్తున్నాయి. యాబీ లిమ్రేత్ ప్రతిపాదించిన పరిణామవాదం, హెర్మన్‌బాండీ ప్రతిపాదించిన యథాస్థితివాదం, ఆర్.సి. టాల్మన్ విశ్వస్పందనవాదం, జ్యార్జగామో అనంత విశ్వవాదం మొదలగునవి ప్రాత సిద్ధాంతాలు కాగా నేడు వ్యోమనౌకల (రాకెట్స్) సహకారంతో చేసే ప్రయోగాలు, పరిశోధనలు మరెన్నో సిద్ధాంతాలను ప్రతిపాదిస్తున్నాయి. ప్రతీ ఏటా కోట్లాది డాలర్లు ఖర్చుపెట్టి భారీ టెలిస్కోపులు నిర్మించి పరిశోధనలు చేస్తూనే ఉన్నారు. అయినా పరిష్కారం కనుచూపుమేరలో కానరావటం లేదు. వీరు ప్రతిపాదించేవి సిద్ధాంతా లనే కన్న ఆలోచనలంటే సరిగా ఉంటుంది. ఇవి కేవలం ఊహాగానాలే.

విశ్వసృష్టిని గురించి ప్రపంచ సాహిత్యంలో ఎన్నెన్నో కథలున్నాయి. దానికికారణం– దేవుడున్నాడని అంగీకరించే ఆస్తికులు అతడే సృష్టికి కర్త యని

నమ్ముతారు కనుక. ప్రపంచంలో ఎన్ని మతాలున్నాయో, ఎన్ని సాంప్రదాయా లున్నాయో అన్ని సృష్టికథ లున్నాయి. ఎవరికి వారు తాము నమ్మేదే సిద్ధాంతమంటారు. దానికి వ్యతిరేకంగా ఎవరైనా ఏదైనా చెబితే - ప్రతిపాదిస్తే వారు సహించలేరు. దానిని ఖండించటానికి శతవిధాల ప్రయత్నిస్తారు. తర్కానికి, హేతువాదానికి, విజ్ఞానానికి నిలబడి ఉండగలిగేదే సిద్ధాంతమని వారికి తెలియదు.

ప్రపంచ సాహిత్యంలో సృష్టికథ లనేకం ఉన్నట్లే భారతీయ సాహిత్యంలోనూ అనేక సృష్టికథ లున్నాయి. మేమంతా ఒకే వేద(హిందూ) మతానికి చెందినవార మనుకుంటూనే ఒక్కొక్క సాంప్రదాయంవారు ఒక్కొక్క సృష్టికథను నమ్ముతారు. బహుళ ప్రాచుర్యం పొందిన 18 పురాణాలు 18 రకాలైన సృష్టి కథలను చెబుతాయి. ఉపపురాణాలు చెప్పే కథలు అనేకం. పురాణాలేవీ వ్యాసమహర్షి వ్రాసినవి కావు. సాంప్రదాయకులెవరో వ్రాసి అవి వారు వ్రాసినవంటే ప్రజలు నమ్మరని వేదవ్యాసులవారు వ్రాసినట్లు ప్రచారం చేసారు. మన ఇతిహాస గ్రంథాలైన రామాయణ మహాభారతాలలోను రకరకాలైన సృష్టికథ లున్నాయి. వీటిలో ఒక్కొక్కటే వాల్మీకి వ్యాసరచితములు. మిగిలినవన్నీ సాంప్రదాయకులు చొప్పించిన ప్రక్షిప్త కథలే. ఈ కథలలో ఒక కథకు మరొక కథకు పొంతన కనబడదు. వీటిలో భారతీయ ఖగోళ విజ్ఞానంతో కలవని కథలే అనేకం. మన ధర్మానికి (మతానికి) మూల గ్రంథాలైన వేదాలతో కూడా యివి భేదిస్తాయి. కనుక మన దేశంలోని సాంప్రదాయక సృష్టికథలన్నీ మధ్యకాలంలో వచ్చినవేకాని ప్రాచీనములు కావు. వైదికములు కావు.

మన ప్రాచీన వైదిక సాహిత్యమైన వేదాలలోను, అంగ ఉపాంగ బ్రాహ్మణ ఆరణ్యక దర్శన ఉపనిషదాదులలోను ఆలంకారికంగా చెప్పబడిన సృష్టికథలలో శైలీ భిన్నత ఉన్నా సిద్ధాంతం ఒక్కటిగానే ఉంటుంది. మన పరమ ప్రమాణ గ్రంథాలైన వేదసిద్ధాంతంతో అవి సమన్వయమౌతాయి. ఈశ్వరీయ జ్ఞానమైన వేదంలో చెప్పబడిన విషయాలనే ఆ ఋషిమునులు తమదైన శైలిలో వారి గ్రంథాలలో వివరించారు. వాటిలో ఐతరేయోపనిషత్తు ఒకటి.

ఐతరేయోపనిషత్కర్త అసలు పేరేమో తెలియదు. 'ఇతర' అనుపేరుగల

ఋషియొక్క పుత్రుడు కనుక అతనిని ప్రజలు 'ఐతరు' డని పిలిచేవారు. అతనిచే వ్రాయబడుటచే దీనికి ఐతరేయఉపనిషత్తనే పేరొచ్చింది. దీనిలో సృష్టికథ ఆలంకారికంగా చెప్పబడింది. బహుశః ఈ కథ గర్భిణీస్త్రీ గర్భంలో పిండవృద్ధిక్రమాన్ని దృష్టిలో పెట్టుకుని ఆ విధంగా ఈ బ్రహ్మాండం పరమేశ్వరుని గర్భంలో రూపుదిద్దుకున్నట్లు ఈ ఋషి కల్పన చేసినట్లు కనబడుతుంది. అది చాలా వైజ్ఞానికంగా ఉంది.

ఐతరఋషి ప్రబోధిత వైజ్ఞానిక సృష్టికథలోనికి వెళ్ళేముందు - ఆధునిక విజ్ఞానం విశ్వసృష్టిని గురించి ఏమి చెబుతున్నదో తెలిసికొందాము.

ఆధునిక ఖగోళవిజ్ఞానం ప్రఖ్యాత గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్‌తో ప్రారంభమయ్యిందని చెబుతారు. ఇతడు క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్దం నాటివాడు. అతడు సముద్రతీరంలో కూర్చొని సుదూరంగా చూస్తూ సముద్రంమీదనుండి ఓడలు రావటం గమనించేవాడు. ముందుగా తెరచాప కొయ్యలు కనబడి, క్రమంగా ఓడ కనబడటం గుర్తించాడు. ఆ ఆధారంతో భూమి గుండ్రంగా ఉందని గట్టిగా ప్రతిపాదించాడు. అంతవరకు ఆ ప్రాంతపు ప్రజలు భూమి బల్లపరుపుగా ఉందని నమ్మేవారు.

భూమి గుండ్రంగా ఉందనే విషయం భారతీయులకు వేదకాలంనాడే తెలుసు. భూగోళం, ఖగోళం అనే పదములు అతి ప్రాచీనమైనవి. ముఖ్యంగా మన జ్యోతిష్యగ్రంథాలలో ఆకాశంలోని గ్రహాలు, ఉపగ్రహాలు, సూర్య నక్షత్రాదులు అన్నీ గోళాకారంలోనే ఉన్నాయని వర్ణింపబడింది. గోళాధ్యాయం, గోళపాదం అనే పేర్లతో సూర్యసిద్ధాంతం, ఆర్యభట్టీయం మొదలైన గ్రంథాలలో ప్రత్యేక అధ్యాయాలు (చాప్టర్స్) ఉన్నాయి. చివరికి అతి పెద్దదైన బ్రహ్మాండం (విశ్వం) మరియు అతి చిన్నదైన పరమాణువు కూడా గోళాకారంలోనే ఉన్నాయని మన జ్యోతిష్యగ్రంథాలు చెబుతాయి. వరాహమిహిరుడు తన 'పంచసిద్ధాంతిక'లో -

"పంచ మహాభూతమయ స్తారాగణపంజరే మహీగోళః ।
ఖేఽయస్కాన్తాన్తః స్థో లోహ ఇవావస్థితో వృత్తః ॥

**(పంచ సిద్ధాంతిక. 13-1)**

"పంచ భూతాత్మకమైన గోళాకారంగా ఉన్న ఈ భూమి ఆకాశంలో తారాగణం అనే పంజరంలో అయిస్కాంతాల మధ్య లోహం ఉన్నట్లు నిరాలంబనంగా నిలిచి" ఉందంటాడు.

అరిస్టాటిల్ భూమి గుండ్రంగా ఉన్నదనే ఒక సత్యం చెప్పినాడే కాని మిగిలిన విషయాలు సరిగాలేవు. అతడు భూమి చలించక స్థిరంగా ఉంటుందనీ, అదే విశ్వానికి కేంద్రమనీ, దాని చుట్టూ సూర్యచంద్ర నక్షత్రాదులన్నీ తిరుగుతున్నాయనీ తప్పుడు సిద్ధాంతాలు ప్రతిపాదించాడు. ఇవన్నీ అనుభవానికి విరుద్ధంగా ఉన్నా ఆ రోజుల్లో వాటిని ఎదిరించే సాహసం ఎవరూ చేయలేక పోయారు. పైగా అప్పటికే ఐరోపాలో బలీయమైనశక్తిగా ఎదిగిన క్యాథలిక్‌చర్చి వర్గాలు అరిస్టాటిల్ సిద్ధాంతాలను బలపరచాయి. అందుచే ఆనాడు వాటిని కాదనే ధైర్యం ఎవ్వరూ చేయలేకపోయారు. ఎవరైనా సాహసించి వాటికి భిన్నమైనవి ప్రతిపాదిస్తే ఈ యిరువర్గాలవారూ కలిసి వారిని చిత్రహింసలకు గురిచేసి చంపివేసేవారు. ఆ కారణంతో ఖగోళవిజ్ఞానం 500 సంవత్సరాలు నిద్రపోయిందని చెప్పవచ్చు.

అనంతరం కీ.శ. 2వ శతాబ్దంలో మరొక గ్రీకు తత్త్వవేత్త 'టాలమీ' కొద్దిగా సాహసించి – అరిస్టాటిల్ సిద్ధాంతానికే కొన్ని సవరణలు చెయ్యడం ద్వారా సమస్యల్ని పరిష్కరించే ప్రయత్నం చేసాడు. గ్రహాలన్నీ చిన్న చిన్న వలయాకార కక్ష్యల్లో (ఎపి సైకిల్స్‌ల్లో) తిరుగుతూనే భూమి చుట్టూ పెద్ద వృత్తాకార కక్ష్యలలో పరిభ్రమిస్తున్నాయనీ, అందుకే వాటి వాటి స్థానాలను బట్టి అవి ఒకసారి ఎక్కువ ప్రకాశవంతంగా, మరొకసారి తక్కువ ప్రకాశవంతంగా కనబడుతున్నాయనీ వివరించ యత్నించాడు. ఈ ప్రతిపాదనకూడా అనుభవంతో సరిపడటం లేదు. అయినా 13 వ, శతాబ్దం చివరివరకు ఐరోపాలో ఈ సిద్ధాంతమే కొనసాగింది. అంటే సుమారు 1400 సంవత్సరాల పాటు ఐరోపాలో ఖగోళ విజ్ఞానానికి మతమౌఢ్యమనే గ్రహణం పట్టిందని భావించవచ్చు.

కీ.శ. 14వ శతాబ్దం చివరి భాగంలో పోలెండు దేశానికి చెందిన నికోలస్ కోపర్నికస్ అను మహానుభావుడు సాహసించి అరిస్టాటిల్, టాలమీల వాదాలలోని లోపాలను చూపిస్తూ "భూమిచుట్టూ సూర్యుడు తిరగటం లేదు –

సూర్యుని చుట్టూనే భూమి తిరుగుతూం"దని అనేక గణిత సూత్రాలతో, యుక్తులతో తర్కంతో ప్రతిపాదించాడు. కాని, వెల్లడించటానికి భయపడ్డాడు. తన భావాలనన్నిటిని ఒక పెద్ద గ్రంథంగా వ్రాసి తన సన్నిహితులకు మాత్రమే చూపించేవాడు. చివరకు 'రాటికస్' అనే పేరుగల అతని శిష్యుడు అతి కష్టంమీద దానిని 'ఆన్ ద రివల్యూషన్ ఆఫ్ ద సెలెస్టియల్ స్ఫియర్స్' అనే పేరుతో జర్మనీలో అచ్చువేయించాడు. కోపర్నికస్ మరణశయ్యమీదే దానిని తనవితీరా చూసుకొని సంతృప్తిగా దివంగతుడయ్యాడు.

ఈ గ్రంథాన్ని చూసి చర్చివర్గాలు, మతమౌఢ్యులు మండిపడ్డారు. చాలా అపచారమన్నారు. ఆ గ్రంథాన్ని నిషేధించారు. అయినా చాటుమాటుగా ఆ గ్రంథం వివేకవంతుల చేజిక్కింది. బహుళ ప్రాచుర్యం పొందింది. క్రీ.శ. 1609వ సంవత్సరంలో గెలీలియో టెలిస్కోపు కనుగొనడంతో కోపర్నికస్ ప్రతిపాదించిన విషయాలను అందరూ ప్రత్యక్షంగా చూడగలిగారు. గ్రహాలను గూర్చిన, నక్షత్రాలను గూర్చిన అనేక క్రొత్త విషయాలు తెలుసుకోగలిగారు. అయినా అరిస్టాటిల్ భక్తులు ఈ సత్యాలను జీర్ణించుకోలేకపోయారు. శ్రద్ధ కలుగకపోగా గెలీలియోపై ద్వేషం పెంచుకున్నారు.

1615వ సంవత్సరంలో క్రైస్తవ మతాధికారియైన పోప్ గెలీలియోను రోమ్ పట్టణానికి పిలిపించి ఒక సభచేసి అతని సిద్ధాంతాలను వివరించమన్నాడు. గెలీలియో నిర్భయంగా తన సిద్ధాంతాలను సోదహరణంగా వివరించాడు. అయినా మతపెద్ద లంగీకరించలేదు. 'ఇవి క్రైస్తవ మత విశ్వాసాలకు, బైబిలు ప్రబోధాలకు' విరుద్ధమన్నారు. అతని పుస్తకాలను, పరిశోధనలను నిషేధించి, ఉల్లంఘిస్తే శిక్షిస్తామన్నారు. మూడురోజులు కారాగారంలో చిత్రహింసలకు గురిచేసి తను ప్రతిపాదించిన సిద్ధాంతాలన్నీ తప్పేనని కాగితం వ్రాయించుకొని విడుదల చేసారు. ఇంతజరిగినా గెలీలియోలోని జ్ఞానేచ్ఛ తగ్గలేదు. రహస్యంగా పరిశోధనలు చేస్తూ మరొక రెండు మహత్తరమైన గ్రంథాలు వ్రాసాడు. దానితో అతడు మరొకసారి మతమౌఢ్యుల ఆగ్రహానికి గురియై అనేక కష్టాల ననుభవించాడు. మౌఢ్యులు అతనిని చంపివేయగలిగారేకాని అతని సిద్ధాంతాలను చంపివేయలే పోయారు.

ఇట్లే ఈ సూర్యకుటుంబమేకాక ఈ విశ్వంలో అనేక సూర్యకుటుంబా లున్నాయని చెప్పినందుకు బ్రూనో అనే పేరుగల వైజ్ఞానికుని జీవించియుండగానే దహనంచేసి చేసారు.

13వ. శతాబ్దంలో క్రైస్తవ చర్చిలు ప్రత్యేకం ఒక ధార్మిక న్యాయాలయాన్ని స్థాపించి బైబిలుకథనానికి భిన్నంగా ఎవరు ఏమి చెప్పినా శిక్షించే అధికారాన్ని దానికిచ్చారు. దానితో ఆ న్యాయాలయం నిరంకుశంగా వ్యవహరించి వేలమంది వైజ్ఞానికులను, వివేకవంతులను చంపివేయించింది. వారి లెక్కల ప్రకారం వివిధ సమయాలలో 10,220 మందిని మంచాలకు కట్టివేసి జీవించియుండగానే దహించివేసారు. 97,321 మందిని వివిధ కఠిన శిక్షలకు గురిచేసారు. వీరి మరణం వైజ్ఞానికులలో విప్లవం తీసుకువచ్చింది. మతమౌఢ్యుల బెదిరింపులకు లెక్కచేయక వారు వారి పరిశోధనలను విస్తృతం చేసారు. టెలిస్కోపును మరింత విస్తృత పరచి ఖగోళంలో జరుగుతున్న సత్యాలను ప్రజలకు చూపించారు. దానితో చేసేది లేక మతమౌఢ్యం మౌనం వహించింది. ఆధునిక విజ్ఞానం వికసించింది.

ఈ విషయంలో మహ్మదీయమతం కూడా క్రూరంగానే వ్యవహరించింది. కురాన్‌లో చెప్పిన దానికి భిన్నంగా ఎవరైనా ఏదైనా చెబితే వీరు సంహించేవారు కాదు. సికందరియాలో జ్ఞాన విజ్ఞాన భరితమైన గ్రంథాలతోకూడిన సువిశాల గ్రంథాలయం ఉండేది. ఎందరో తత్త్వవేత్తలకు, వైజ్ఞానికులకు ఆ గ్రంథాలయం మార్గదర్శనం చేసేది. అవన్నీ నాస్తిక గ్రంథా లనే నెపంతో 7వ శతాబ్దంలో ఉమర్‌ఖలీఫా వాటన్నిటినీ దహించివేయమని ఆజ్ఞాపించాడు. చేసేదిలేక సైనికులు వాటికి నిప్పంటిస్తే అవి కొన్ని నెలలపాటు నెగడిమంటలవలె కాలినవట.

నేడు సువిశాల విశ్వ పరిధిని చూపడానికి 100, 200 అంగుళాల వైశాల్యంగల టెలిస్కోపులు కూడా సరిపోవటం లేదు. రేడియో టెలిస్కోపులు నిర్మిస్తున్నారు. నక్షత్రాల దూరాన్ని కొలవడానికి కాంతి సంవత్సరాలు సరిపోవటంలేదు. మరొక కొలమానం అవసరమౌతుందేమో ! అట్లే, నక్షత్రాల మొత్తం సంఖ్య కూడా అంతుబట్టడంలేదు. సుమారు $10^{22}$ అంటే 10 తరువాత 22 సున్నలు పెడితే ఎంత సంఖ్య అవుతుందో అన్ని నక్షత్రా లుండవచ్చునని

వైజ్ఞానికులంటున్నారు. వాటిని సెకనుకు ఒకటి చొప్పున లెక్కపెట్టినా కోటి కోట్ల సంవత్సరాలు పడుతుందట. ఇంతవరకు కనుగొన్న అత్యంత దూరంలో ఉన్న గెలాక్సీ నుండి కాంతి మన భూమిని చేరుకోవడానికి 13,000 మిలియన్ల సంవత్సరాలు పడుతుందట. ఆ చివరి గెలాక్సీ తరువాత కూడా మరికొన్ని గెలాక్సీ లున్నాయేమో తెలియదు. ఈ విధంగా విశ్వపరిధే అర్థంకాని నేటి విజ్ఞానానికి విశ్వావిర్భావం అర్థంకావటం కష్టమే. అయినా ప్రయత్నం చేస్తూ ఉండటమే మంచిది. అదే పురుష లక్షణం.

ఈ భూమిపై ప్రాణులు పుడుతూ చస్తూ ఉన్నట్లే విశ్వంలో నక్షత్రాలు పుడుతూ చస్తూ ఉంటాయి. కాకపోతే వాటి జీవనకాలం కోట్లాది సంవత్సరాలు. ఇక్కడ రకరకాల ప్రాణిజాతులున్నట్లే రకరకాల నక్షత్రాలుంటాయి. ఈ మధ్య విశ్వంలో నక్షత్రాలు, నక్షత్రరాశులతోబాటు బ్లాక్ హోల్స్ కూడా ఉన్నట్లు కనుగొన్నారు.

బ్లాక్‌హోల్ అంటే రోదసిలో అత్యంత తీవ్రమైన గురుత్వాకర్షణ క్షేత్రం కలిగి ఏ ద్రవ్యంగానీ, ఏ కాంతికిరణంగానీ దానినుండి విముక్తి పొందలేని ప్రదేశం. నక్షత్రాల అంతిమదశే బ్లాక్‌హోల్‌గా (కృష్ణబిలంగా) మారుతుందని వైజ్ఞానికు లంటున్నారు. కాలాంతరంలో ఆ కృష్ణబిలం నుండే మరల గెలాక్సీలు (నక్షత్రాల గుంపులు) ఉద్భవిస్తున్నాయంటున్నారు. దీనినిబట్టి సృష్టి స్థితి ప్రళయాలు ఎప్పుడూ జరుగుతూనే ఉంటాయేమో ననిపిస్తున్నది. కానీ, ఇవన్నీ పాక్షిక సృష్టి స్థితి ప్రళయాలే. పూర్తిగా ప్రళయం జరిగి మరల సృష్టికూడా 432 కోట్ల సంవత్సరాల కొకసారి జరుగుతూవుంటాయని మన శాస్త్రాలు. కాలగణనతో ఏకీభవించక పోయినా పూర్ణప్రళయ పునఃసృష్టులను నేటి వైజ్ఞానికులు కూడా అంగీకరిస్తారు. ప్రకృతిలోని శాశ్వత నియమాలవల్లనే ఆ సృష్టిప్రళయాలు ఒకే రకంగా జరుగుతాయని వైజ్ఞానికుల కథనం. జడమైన ఆ ప్రకృతిలో శాశ్వత నియమాల నేర్పరచి దానిని శాసించి నడిపించే ఒక మహత్తర చేతనపదార్థం (జ్ఞానంగల పదార్థం) ఒకటుందనీ, దానినే మేము పరమేశ్వరు డంటున్నామనీ మన ఋషుల కథనం. ఆ పునః సృష్టిని గురించి వీరిరువురు ఏమంటున్నారో తెలుసుకుందాము.

ఆధునిక విజ్ఞానవేత్తల కథనం ప్రకారం శూన్యంగా ఉండే రోదసిలో ముందుగా మూలవాయువు (ప్రీమోర్డియల్ గ్యాస్) నిండుతుంది. క్రమంగా ఆ మూలవాయువు గాలి బిందువులుగా ఏర్పడుతుంది. ఆ బిందువులన్నీ కలిసి పెద్ద గోళమౌతుంది. ఆ గోళం కుదించుకుపోతూ అత్యంత వత్తిడికి గురియై అగ్నిగోళంగా మారిపోతుంది. 'సర్ లోవెల్' అను వైజ్ఞానికుని అభిప్రాయం ప్రకారం ఆ పెద్ద అగ్నిగోళం (మహదండం) ప్రేలిపోయి ముక్కలుముక్కలుగా విడిపోయి దూరదూరాలకు విసిరివేయబడతాయి. ఆ ముక్కలే క్రమంగా నక్షత్రాలుగా, గ్రహాలుగా, ఉపగ్రహాలుగా, ఉల్కలుగా రూపుదిద్దుకుంటాయి. వాటిపై భూమివంటి వాతావరణం (గాలి, నీరు మొదలైనవి) ఏర్పడినపుడు ప్రాణిసృష్టి జరుగుతుంది.

ఈ ప్రక్రియలన్నీ కేవలం ప్రకృతిలో నెలకొని వున్న శాశ్వత నియమాలవల్ల జరుగుతున్నవేకాని సృష్టికర్త ఎవరూ లేరని నేటి వైజ్ఞానికులలో ఎక్కువమంది అభిప్రాయం. ప్రాణిసృష్టి విషయంలో దార్విన్ వికాసవాదాన్ని అంగీకరిస్తున్నారు. ఆ విషయాలనే కళాశాలలో విద్యార్థులకు బోధిస్తున్నారు. కాని మన వేదం దీనిని అంగీకరించదు. సృష్టికర్తవల్లనే యివన్నీ యోజనాబద్ధంగా జరుగుచున్నా యంటుంది. ఋగ్వేద దశమ మండలంలోని నాసదీయ, అఘమర్షణ సూక్తాలు సృష్టిరచనను అతి స్పష్టంగా వివరిస్తాయి. హిరణ్యగర్భ సూక్తం సృష్టికి ఒకే ఒక కర్త ఉన్నాడనీ, అతడు సర్వవ్యాపకుడూ సర్వశక్తిమంతుడూ నని చెబుతుంది. జీవులుచేసే కర్మలకు ఫలప్రదాతకూడా అతడే నంటుంది. అతడు సుఖ స్వరూపుడు కనుక అతని ఆజ్ఞలను పాలించి అతనికి దగ్గర కమ్మంటుంది. ఇక, మన ఐతరేయోపనిషత్తు చెప్పే సృష్టికథ ఏమిటో తెలుసుకుందాము.

## ఐతరేయోపనిషత్ కథనము

### ప్రథమాధ్యాయము - ప్రథమ ఖండము

ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్
నాన్యత్ కించన మిషత్
స ఈక్షత లోకాన్ను సృజా ఇతి. (1)

ఈ సృష్టి రచింపబడక పూర్వం ఆత్మ ఒక్కటియే యుండెను. క్రియగలిగిన మరియొక పదార్థం లేకుండెను. అప్పుడు ఆ పరమాత్మ లోకములను సృజించవలెనని ఈక్షించెను.

సృష్టికి పూర్వం రోదసిలో కేవలం శూన్యమే లేదు. అంతకుపూర్వసృష్టిలోని నక్షత్రాలన్నీ నిర్వీర్యమై అణువులుగా పరమాణువులుగా - కాస్మిక్ డస్టుగా మారిపోతాయి. ఆ బూడిద విశాల విశ్వంలో అతి పలుచగా చదరపు కిలోమీటరుకు 1, 2 పరమాణువులుగా అప్రకేతంగా - తెలియబడనివిధంగా ఉంటుంది. ఆ స్థితిని వేదం ఈ విధంగా వర్ణిస్తుంది.

తమ ఆసీత్తమసా గూఢ మగ్రేఽప్రకేతం సలిలం
సర్వమా ఇదమ్ । తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీ
త్తపసస్తన్మహినా జాయతైకమ్ ॥(ఋగ్వేదం. 10-129-3)

"ఈ సృష్టికి పూర్వం ఈ జగత్తంతా గాఢాంధకారంతో సలిలంగా అంటే పరమాణు సముద్రంగా - ఏమీ తెలియరాని విధంగా ఉంటుంది. అదికూడా అనంత పరమేశ్వరునిలో ఏదో ఒక మూల తుచ్ఛంగా అల్పంగా పడివుంటుంది. ఆ సూక్ష్మ పరమాణువులతోనే పరమేశ్వరుడు తన మహిమతో ఈ చిత్రవిచిత్ర జగత్తును నిర్మించా" డని చెబుతుంది.

కనుక పై ఐతరఋషి వాక్యం క్రియకలిగిన మరియొక చేతనపదార్థం లేదన్నదేకాని మరేవీ లేనేలేవని చెప్పలేదు. సృష్టిలో ప్రతీ పదార్థానికి ఉపాదానకారణం (మూలకారణం) ఒక్కటిఉన్నట్లే ఈ సృష్టికి మూలపదార్థం ఒకటుంటుంది. దానితోనే పరమేశ్వరుడు సృష్టిని చేస్తాడు. కేవలశూన్యం నుండి పరమేశ్వరుడు కూడా ఏమీ సృజించలేడు. "నాసతో విద్యతే భావః, నాభావో విద్యతే సతః - లేని దానినుండి (శూన్యంనుండి) ఏమీ పుట్టదు. ఉనికి గలిగినది ఏదీ పూర్తిగా లేకుండా పోదు - (శూన్యంగా - అభావంగా కాదు) అనేది ప్రకృతినియమం.

ఆ ఆత్మ(పరమాత్మ) లోకాలను సృజించాలనే ఈక్షణం (సంకల్పం) చేసింది. ఆ ఈక్షణమే స్తబ్ధంగా ఉన్న ప్రకృతిలో క్షోభను (క్రియను) కలిగిస్తుంది. దానితో

రోదసిలో అతి పలుచగా అక్కడక్కడ పడిఉన్న పరమాణువులు దగ్గరగా చేరుతూ ఒక మహదండంగా ఏర్పడతాయి. దీనిని మన శాస్త్రాలు 'హిరణ్యగర్భం' అంటాయి. దానిలో మరింతగా వత్తిడిపెరిగి ఆ మహదండం పగిలిపోతుంది. దీనినే మన వైజ్ఞానికులు 'బిగ్‌బ్యాంగ్' అంటున్నారు. ఈ ప్రేలుడు 15 బిలియన్ల సంవత్సరాల క్రితం జరిగిందని వారి అంచనా.

సర్ లోవెల్ కథనం ప్రకారం "ఆ ప్రేలుడు చాలా ఖచ్చితమైన సమయంలో జరిగింది. ఆ సమయంలో ఒక సెకనులోని నూరవ భాగం (ఫ్రాక్షన్ ఆఫ్ సెకండ్) తేడా అయినా హైడ్రోజన్‌వాయువు పుట్టేది కాదు. ఈ విశ్వం ఏర్పడేది కాదు. కనుక మహదండాన్ని ప్రేల్చింది (బింగ్‌బ్యాంగ్ చేసింది) అనంత పరిపూర్ణ జ్ఞానం కలిగిన ఒక మహత్తర శక్తి" యని ఆయన అంటారు. దానినే మనం పరమాత్మ అంటున్నాము.

ఆ బిగ్‌బ్యాంగ్‌తో రోదసి (స్పేస్) అంతా దట్టమైన వాయువులు వ్యాపించాయి. ఈ స్థితినే మన ఋషులు 'ఆకాశాద్వాయుః' – ఆకాశం నుండి వాయువు పుట్టిందన్నారు. దానిని నేటి విజ్ఞానం 'నెబ్యులా' అంటున్నది. ఈ వాయుమేఘాల్లో 99 శాతం హైడ్రోజన్, కొద్దిపాటి యితర వాయువులు, సూక్ష్మ హిమకణాలు, కాస్మిక్‌ధూళి ఉంటాయట. ఆ వాయు ధూళిమేఘాల ఉష్ణోగ్రత –263 డిగ్రీల సెంటీగ్రేడ్ ఉంటుందట. ఆ మేఘాలు మరల గురుత్వాకర్షణ శక్తివల్ల కుదించుకుపోతూ చిన్న చిన్న అండాలుగా ఏర్పడతాయట. ఆ అండాలు మరింతగా కుదించుకుపోవటంతో వాటి మధ్యభాగంలో ఉష్ణోగ్రత పెరిగిపోతూ పది మిలియన్ల డిగ్రీల సెంటీగ్రేడ్‌కు చేరుకుంటుంది. సరిగా ఆ స్థితిలోనే హైడ్రోజన్ అణువులు సంయోగం చెంది హీలియం ఏర్పడుతుంది. ఈ సంయోగంవల్ల ఉత్పన్నమైన అత్యధికశక్తి కాంతిరూపంలో, ఉష్ణరూపంలో ఉంటుంది. అట్టివాటినే నక్షత్రాలు (సూర్యులు) అంటారు. ఈ క్రియనే మన ఋషులు 'వాయోరగ్నేః – వాయువు నుండి అగ్ని పుట్టిందన్నారు.

మనకు ఆకాశంలో కనబడే నక్షత్రాలన్నీ సూర్యులే. వాటి మధ్యభాగం నుండి అనేక రకాల కిరణాలు బయటకు దూసుకుపోతూ ఉంటాయి. వాటిలో

కాంతికిరణా లుండటంవల్ల మనం వాటిని చూడగలుగుతున్నాం. ఈ నక్షత్రాలలో కూడా 3, 4 రకాలుంటాయంటారు వైజ్ఞానికులు. వారి లెక్కలనుబట్టి మన సూర్యుడు చిన్న నక్షత్రం. అది మన భూమికి 9 కోట్ల 28 లక్షల మైళ్ళ దూరంలో ఉంది. దానినుండి కాంతి మన భూమికి చేరటానికి 8.3 నిముషాలు పడుతుందట. సృష్ట్యాదిలో దానినుండి విడిపోయిన ముక్కయే మన భూగోళం. విడిపోయినపుడు మన భూమికూడా అగ్నిగోళంగానే ఉండేది.

ఆధునిక విజ్ఞాన కథనం ప్రకారం – భూమిగా విడిపోయిన అగ్నిగోళంలో చాలా రసాయనిక మార్పులు జరిగాయి. దానితో అత్యధికఉష్ణం ఏర్పడి భూమంతా మూసలోపోసి కరిగిన బంగారంలాగ కరిగిపోయింది. అప్పుడు బరువైన యినుము, నికెల్ వంటివి కేంద్రం దగ్గరికి చేరి కోర్‌గా (పండ్ల మధ్యలోని గింజలవలె) ఏర్పడ్డాయి. వాటిపైన తేలిక లోహాలు చేరి ఔటర్‌కోర్‌గా ఏర్పడ్డాయి. ఆ విధంగా పొరలు ఏర్పడుతూ పై పొరగా (క్రస్టుగా) మట్టి, ఇసుక, రాళ్ళు మొదలైనవి ఏర్పడ్డాయి. ఈ ప్రక్రియలో ఆ ఘనపదార్థాలలోని వాయువులు బయటకు త్రోసివేయబడి భూమిచుట్టూ గాలిపొరగా (వాతావరణంగా) ఏర్పడ్డాయి.

ఆ వాతావరణపొరలో నీటియావిరి శాతం కూడా ఎక్కువగానే ఉందనీ, అదే క్రమంగా మేఘాలుగా ఏర్పడిందనీ, పరిస్థితులు అనుకూలించినపుడు ఆ మేఘాలు వర్షించి భూమిపై నదులుగా సముద్రాలుగా ఏర్పడ్డాయనీ ఆధునిక విజ్ఞానం చెబుతుంది. బహుశః ఏదో ఉష్ణ ప్రకియవల్ల హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువులు కలిసి నీటియావిరి ఏర్పడి ఉంటుంది. ఆ ఉష్ణ ప్రక్రియనే మన ఋషులు 'అగ్నేరాపః – అగ్నినుండి నీరు ఏర్పడిం" దన్నారు. ఆ వర్షాలవల్ల (నీటివల్ల) భూమి యొక్క పైపొర చల్లబడి మట్టి ఏర్పడింది. ఈ ప్రక్రియను మన ఋషులు "అద్భ్యః పృథివీ – నీటినుండి భూమి పుట్టిం"దన్నారు.

పై విధంగా పరమేశ్వరుని ఈక్షణతో (సంకల్పంతో) ఈ విశ్వం ఏర్పడింది. ఆ విధంగా ఏర్పడిన ఈ విశాల విశ్వాన్ని ఐతరఋషి 4 లోకాలుగా విభజించి వర్ణించాడు. అవి ఏవియో తెలిసికొందామా ?

స ఇమాన్ లోకా నసృజ తాంభో
మరీచీ మర మాపో౽దో౽ంభః,
పరేణ దివం ద్యౌః, ప్రతిష్ఠాంతరిక్షం మరీచయః,
పృథివీ మరో యా అధస్తాత్తా ఆపః ॥ (2)

ఆ పరమేశ్వరుడు అంభస్సు, మరీచి, మరము, ఆపస్సు అనెడి నాలుగు లోకాలను సృష్టించాడు. ద్యులోకమునకు పైన ఉండేది అంభోలోకం. అంటే సూర్యునినుండి పైగా ఉండే నక్షత్రాదులుండే లోకం. దానికి (సూర్యునికి) క్రిందుగా ఉండే అంతరిక్షం మరీచీలోకం. మరీచిక లంటే కిరణాలు. దీనిలో సూర్యచంద్ర నక్షత్రాదుల కిరణాలు ప్రయాణం చేస్తుంటాయి. కనుక అది మరీచీలోకం. మనము నివసించే ఈ భూమి మరలోకము. దీనిలో పుట్టిన ప్రాణులు మరణిస్తూ ఉంటాయి కనుక మహర్షి దీనికి మర అనిపేరు పెట్టాడు. ఈ భూమికి క్రిందుగా జలం ఉండే భాగానికి ఆపః లోకమని పేరుపెట్టాడు. నదులు, సముద్రాలు భూగర్భజలాలు ఆపోలోక మనవచ్చు. వీటిలోకూడా అసంఖ్యాక ప్రాణులు జీవిస్తున్నాయి కదా !

సముద్రం ఒక ప్రపంచంగా ఉంటుంది. భూమిపై కన్న సముద్రంలోనే ప్రాణిజాతులు, ప్రాణులు ఎక్కువున్నాయంటున్నారు వైజ్ఞానికులు. ఇంతవరకు 354 కుటుంబాలకు (ఫ్యామీలీస్‌కు) చెందిన 80,000 రకాల జల జీవజాతుల వివరాలు సేకరించారు. ఈ మధ్య సముద్రంలో 5 కిలోమీటర్ల లోతున 500 జాతుల అతిచిన్న ప్రాణుల ఉనికిని కనుగొన్నారు. సముద్ర జలాల్లో దాదాపు కోటి బ్యాక్టీరియా జాతులుండవచ్చు నంటున్నారు. సముద్రపు అడుగున పెరిగే అల్గే జాతి నాచుమొక్కలను తిని చిన్న చేపలు జీవిస్తాయి. ఆ చిన్న చేపలను పెద్ద చేపలు తింటాయి. ఈ విధంగా చిన్నవాటిని పెద్దవి తింటూ సముద్రంలో చాలారకాల ప్రాణులుంటాయి. కలకత్తా, విశాఖపట్నం మొదలైన చోట్ల గల ఎక్వేరియంలను (చేపల పెట్టెలను) చూస్తే మనకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది. ఎన్నెన్నో వింత వింత ఆకారాలతో, రంగులతో, ఒయ్యారాలతో అవి ఈదుతూ ఉంటే వాటిని చూస్తూ అట్లే ఉండిపోవాలనిపిస్తుంది. పరమేశ్వరుడు ఎంతటి గొప్ప శిల్పో అనిపిస్తుంది. అందుచేతనే పరమేశ్వరునికి గల అనేక నామాలలో 'త్వష్టా'

ఒకటి. త్వష్టా అంటే శిల్పి అని అర్థం.

సామాన్యంగా వైదిక వాఙ్మయంలో మూడు లోకాల వర్ణన కనబడుతుంది. వాటిని మన ఋషులు భూలోక భువర్లోక స్వర్లోకాలుగా వర్ణించారు. ఈ ఐతరేయ ఋషి వాటిని మర మరీచీ అంభో లోకాలన్నాడు. భూలోకంలో ప్రాణులు మరణిస్తున్నాయి కనుక దానికి మర యని పేరు పెట్టాడు. సామాన్యంగా వాయువు సంచరించే భాగాన్ని భువర్లోక మంటారు. కాని, ఈ ఋషి మరికొంత విశాలంగా ఆలోచించి గాలి పొరతోబాటు సూర్యునివరకు ఉండే ఆకాశభాగాన్నికూడా కలుపుకొని దానిని మరీచీ లోకమన్నాడు. అది సూర్యకిరణాలు పయనించే భాగం. సూర్యునినుండి పైన ఉన్న నక్షత్రాల నన్నిటిని కలుపుకొని దానికి అంభోలోకమని పేరుపెట్టాడు. అంభః అంటే ధ్వని చేసేదని అర్థం. దీని కా పేరు పెట్టడానికి ఒక కారణముంది -

ఆధునిక వైజ్ఞానికుల అభిప్రాయం ప్రకారం సృష్టికి పూర్వం ఆకాశం, దానిలో మూలవాయువు (ప్రీమోర్డియల్‌గ్యాస్) ఉండేవి. ఆ వాయువు కూడా చాలా చల్లగా -263 డిగ్రీల సెంటీగ్రేడ్‌లో ఉండేది. అప్పటికింకా అగ్ని పుట్టలేదు. కాంతి కూడా పుట్టలేదు. పూర్వం తెలిసికొన్నట్లుగా అది చాలా గాఢాంధకార స్థితి. ఆ మూలవాయువంతా ఒక చోట చేరి మహదండ మయ్యింది. అది వత్తిడికి గురియై ప్రేలిపోయింది. అప్పుడు వాయుగమనంవల్ల, ప్రేలిపోవటంవల్ల (బింగ్ బ్యాంగువల్ల) పెద్ద శబ్దమే పుట్టి ఉంటుంది. బహుశః ఆ కారణంతోనే ఆ పై లోకానికి అంభోలోకమని ఋషి పేరుపెట్టి ఉంటాడు. వేదంలోనూ సృష్టి ప్రారంభిక దశను అంభఃగా పేర్కొనుట కనబడుతుంది. "**శర్మన్ అంభః కిమాసీద్ గహనం గభీరమ్** ॥ (ఋ. 10-129-1) అని వేదం చెబుతుంది.

పై మూడు లోకాలేకాక ఈ ఋషి మరొక లోకాన్ని కల్పించి ఆపోలోకమని పేరు పెట్టాడు. పూర్వం తెలిసికొన్నట్లుగా నీటిలోకూడా అనేక ప్రాణులున్నాయి. కనుక దానిని ఆపోలోక మన్నాడు.

లోకాల సృష్టి అనంతరం లోకపాలకు లవసరమయ్యారు. అప్పుడు -

స ఈక్ష తేమేను లోకా లోకపాలాన్ను సృజా ఇతి ।
సో ఽద్భ్య ఏవ పురుషం సముద్ధృ త్యామూర్ఛయత్ ॥ (3)

ఆ పరమేశ్వరుడు లోకాలను వీక్షించి వీటిని చక్కగా పాలించుటకు లోకపాలకులను కూడా సృజింతునని ఈక్షించెను (సంకల్పించెను). అనంతరం ఆపస్సు నుండియే పురుషుని పైకి తీసి (సృజించి) అతనిని మూర్ఛిల్లజేసెను.

ఇక్కడ ఆపః అంటే సామాన్య జలమని అర్థంకాదు. మూలప్రకృతినుండి మొదటగా ఏర్పడిన మహతత్త్వం. మహతత్త్వాన్నికూడా ఆపః అనే పదంతో పేర్కొనటం మన ప్రాచీన శాస్త్రాలలో కనబడుతుంది.

అప ఏవ ససర్జా ఽఽ దౌ తాసు బీజమవా సృజత్ ॥

(మనుస్మృతి. 1-8)

పరమాత్మ సృష్టిని చేయ సంకల్పించి ముందుగా మూల ప్రకృతినుండి అపను (ఆపఃను) సృజించాడు. అట్టి ఆపస్సులో శక్తిరూప బీజాన్ని ఉంచాడు.

పరమేశ్వరుడు విడిచిన ఆ శక్తిరూప బీజంతో ఆ ఆపస్సులో చక్రాకారగతి ఉత్పన్నమై అది గుండ్రటి ఆకారాన్ని (అండాకారాన్ని) ధరిస్తుంది. దీనినే మన శాస్త్రాలు హిరణ్యగర్భ మంటున్నాయి. ఈ ఐతర ఋషి దానిని పురుషు డంటున్నాడు. అంటే విరాట్‌పురుషు డని మనం గ్రహించాలి.

పురుష పదం సామాన్యంగా పరమేశ్వరునకు వర్తిస్తుంది. కాని యిక్కడ సృష్టికర్తయే ఆపస్సునుండి పురుషు నుద్భవింపచేసాడని చెప్పబడుటచే ఈ పురుషుని విరాట్‌పురుషుడని అర్థం చేసుకోవాలి. పురుష పదానికి 'పురే శయతి ఇతి పురుషః' అని నిర్వచనం చెబుతారు. కనుక సందర్భాన్ని బట్టి పురుష పదం పరమాత్మకు, జీవాత్మకు, ప్రకృతికి, ప్రకృతితో ఏర్పడిన శరీరానికి కూడా వర్తిస్తుంది.

ఆ విరాట్‌పురుషుని పరమేశ్వరుడు మూర్ఛిల్లచేసాడంటే సూక్ష్మాన్ని స్థూలం చేసాడని అర్థం. లేదా గట్టి చేసాడని గ్రహించాలి. కత్తులకు కొడవళ్ళకు పదునుపెట్టి గట్టిచేయడానికి వాటిని అగ్నిలో కాల్చి పదునుపరచి వెంటనే నీటిలో ముంచుతారు. దానితో అవి గట్టిపడతాయి. ఆ విధంగా మూర్ఛిల్లజేసిన ఆ విరాట్‌పురుషుని తపింపజేసాడని తదుపరి వాక్యాలు చెబుతాయి.

'త మభ్యతపత్, తస్యాభితప్తస్య ముఖం నిరభిద్యత యథాండమ్' - ముఖాద్ వాక్, వాచో౨గ్నిః ;

పరమేశ్వరుడు ఆ విరాట్ పురుషుని తపింపజేసాడు. తప్తముచేయబడిన ఆ పురుషునిలో ముందుగా ఒక రంధ్రమేర్పడింది. అదే ముఖం (నోరు). సంస్కృతంలో ముఖం అనే పదానికి నోరు అని కూడా అర్థం ఉంది. ఆ నోటి నుండి వాక్ పుట్టింది. వాక్ నుండి అగ్ని ఉద్భవించింది.

ఇది ఒక ఆలంకారిక వర్ణన. ఈ ఐతరేయ ఋషికి గర్భంలో పిండవృద్ధి క్రమాన్ని తెలిపే శాస్త్రం (Embreology) బాగా తెలుసు ననుకుంటాను. ఆ విధంగానే విరాట్‌పురుషుని జననం కూడా జరిగినట్లు వర్ణిస్తున్నాడు.

రజో వీర్యాల సంయోగంతో పిండం ఏర్పడుతుంది. స్త్రీశరీరం క్షేత్రంగాను, పురుషశరీరం బీజ ప్రదాతగాను ఉంటాయి. స్త్రీలలో నెలకొకటిగా విడుదలయ్యే అండం అర్ధకణంగా ఉంటుంది. అంటే దానిలో 23 ఒంటరి క్రోమోజోములు మాత్రమే ఉంటాయి. పురుషుని వీర్యకణంకూడా అర్ధకణమే దానిలోనూ 23 ఒంటరి క్రోమోజోములే ఉంటాయి. ఇవి రెండూ కలిసి పూర్ణకణం ఔతుంది. దానిలో క్రోమోజోములు జతలుగా (23 జతులుగా) ఉంటాయి. వీటిలోని జీన్స్ అటు తండ్రినుండియు, ఇటు తల్లినుండియు వంశపారపర్యక లక్షణాలను తీసుకువస్తాయి. అప్పటినుండి ఒక నెలవరకు ఆ పూర్ణకణం కణవిభజనతో రెట్టింపు రెట్టింపుగా అవుతూ పెరుగుతుంది. అంటే – ఒకటి రెండుగా, రెండు నాలుగుగా, నాలుగు ఎనిమిదిగా. .... ఈ విధంగా పెరుగుతుంది. దానితోబాటు ఒకేరకంగా ఉండే కణాలు వివిధ రకాలుగా– రక్త మాంస అస్థి చర్మ కణాలుగా విభజింపబడి వృద్ధి చెందుతాయి. అట్లే విరాట్ పురుషునిలో వివిధ మూలకాలు (ఎలిమెంట్స్) రూపుదిద్దుకుంటాయి. ఈ ప్రక్రియనే ఈ మహర్షి 'తమ్ అభ్యతపత్ - ఆ విరాట్ పురుషుని సృష్టికర్త తపింపజేసా' డంటున్నాడు.

గర్భస్థ మానవపిండములో ముందుగా నోరు, స్వరపేటిక, అన్నవాహిక జీర్ణాశయం ఏర్పడతాయి. నోటి వద్ద రంధ్రమేర్పడి తెరచుకుంటుంది. ఆ విధంగానే

విరాట్‌పురుషపిండంలో ముందుగా నోరు ఏర్పడి అందుండి వాక్‌శక్తి, ఆ వాక్ శక్తినుండి అగ్ని ఏర్పడిందని ఈ ఋషి అంటాడు. 'ముఖాదగ్ని రజాయత - ముఖమునుండి (నోటినుండి) అగ్ని ఏర్పడిం'దని యజుర్వేదం (31-12) చెబుతుంది.

వేదం ఈశ్వరీయ జ్ఞానం. వేదజ్ఞానం వల్లనే ఆదిమానవులు జ్ఞానవంతు లయ్యారు. విషయ విభాగాన్ని బట్టి వేదాలు నాలుగు. ముఖ్యంగా ఋగ్వేదం పదార్థజ్ఞానాన్ని, యజుర్వేదం కర్మకాండను, సామవేదం ఉపాసనాకాండను, అథర్వవేదం విజ్ఞానకాండను బోధిస్తాయి. వాటిలో మానవులకు కావలసిన సమస్త విద్యలు బీజరూపంలో ఉన్నాయి. సృష్టిరచనావిజ్ఞానం కూడా అందులో ఉంది. ముఖ్యంగా నాసదీయ, అఘమర్షణ, పురుషసూక్తాలు సృష్టిని గురించి వివరిస్తాయి. ఆలంకారిక రూపంలో ఉన్న సృష్టివిజ్ఞానం పురుషసూక్తాలలో ఉంది. ఋక్ యజు అథర్వవేదాలలో స్వల్పభేదంతో ఈ సూక్తాలున్నాయి. పురుషసూక్తం విశ్వాన్ని ఒక మానవ శరీరంతో పోలుస్తూ ఎవరిస్థానం ఏ విధంగా ఉంటుందో వర్ణిస్తుంది. విరాట్‌పురుషునకు, వేదాలకు కర్త పరమేశ్వరుడే నంటుంది. మానవ సమాజాన్ని ఒక శరీరంతో పోలిస్తే-బ్రాహ్మణులు ముఖతుల్యంగాను, క్షత్రియులు బాహువులుగాను, వైశ్యులు ఊరువులుగాను, శూద్రులు పాదములుగాను (శ్రమశక్తిగాను) ఉంటారంటుంది.

బ్రాహ్మణో௨స్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥

(యజు. 31-11)

ఈ మంత్రంలోని చివరి 'పద్భ్యాం శూద్రో అజాయత' అనే వాక్యానికి పాదములనుండి శూద్రులు పుట్టినారనికాదు. శరీరాన్ని పాదములు నడిపించినట్లుగా సమాజరూప శరీరాన్ని శ్రామికులు నడిపిస్తారని భావం. మానవులు ఏ గుణకర్మ స్వభావాలకు చెందినవారైనా గర్భకోశంనుండే పుడతారుకాని పాదాలనుండి కాదు కదా! పురుషసూక్తంలోని తదుపరి రెండు మంత్రాలు ప్రాకృతిక శక్తులు విరాట్‌పురుషునిలో (విశ్వంలో) ఏ స్థానంలో లేదా ఏఏ అవయవాలుగా

ఉంటాయో కల్పనచేస్తూ ఆలంకారికంగా వర్ణిస్తాయి.

చంద్రమా మనసో జాతశ్చక్షోః సూర్యో అజాయత ।
శ్రోత్రాద్వాయుశ్చ ప్రాణశ్చ ముఖాదగ్ని రజాయత ॥
నాభ్యా ఆసీదన్తరిక్షం శీర్ష్ణోద్యౌః సమవర్తత ।
పద్భ్యాం భూమి ర్దిశః శ్రోత్రాత్తథా లోకాన్ అకల్పయన్ ॥
(యజు. 31-12,13)

పూర్వమంత్రంలోవలెనే ఈ మంత్రంలోని జాత, అజాయత అనే పదములకు పుట్టినవనికాక ఆ యా అవయవాలుగా ఉంటాయని అర్థం చేసుకోవాలి. ఐతర ఋషి తెలిపే తదుపరి వాక్యాలనుకూడా అట్లే అర్థం చేసుకోవాలి.

గర్భస్థ పిండములో ముందుగా నోరు తెరచుకున్నట్లుగా హిరణ్యగర్భుని గర్భంలో విరాట్పిండము నోరు తెరుచుకొంటుంది. అందుండి వాక్ శక్తి పుట్టి, వాక్ నుండి అగ్ని పుట్టిందంటే - విద్యుదయస్కాంత అలలు (ఎలక్ట్రో మేగ్నెటిక్ వేవ్స్) పుట్టి వాటినుండి అగ్నితత్వం పుట్టినట్లు గ్రహించాలి. లేదా అగ్ని విరాట్ పురుషునికి నోరుగా ఉంటుందని గ్రహిచాలి. అనంతరం -

**నాసికే నిరభిద్యేతామ్, నాసికాభ్యాం ప్రాణః, ప్రాణాద్ వాయుః**

గర్భస్థ పిండములో నోరు తెరుచుకున్న పిదపనే నాసికారంధ్రాలు తెరచుకుంటాయి. మొదటి నెల చివరిలో పిండం తల,నోరు మాత్రమే కలిగిఉంటుంది. ఐదవవారం నాసికారంధ్రాలేర్పడతాయి. అప్పటినుండి అంగిలి, నాలుక, కొండనాలుక, గొంతు నిర్మింపబడతాయి. క్రమంగా పిండంలో ప్రాణశక్తు లేర్పడతాయి. అయినప్పటికీ నాసికద్వారా ప్రాణసంచారం జరుగదు. గర్భంలో ఉన్నంతకాలం పిండం తల్లిరక్తం ద్వారానే ప్రాణవాయువును గ్రహిస్తూ జీవిస్తుంది. ప్రసవానంతరం శిశువులో నాసికద్వారా ప్రాణసంచారం మొదలౌతుంది.

ఇచట విరాట్ పురుషునికి వాయువు నాసికవలె ఉంటుందని గ్రహించాలి. తదుపరి -

అక్షిణీ నిరభిద్యేతామ్ - అక్షిభ్యాం చక్షుః, చక్షుషః ఆదిత్యః

అనంతరం - కంటిరంధ్రాలు ఏర్పడతాయి. అందుండి కన్నులు - కన్నులనుండి ఆదిత్యుడు ఉద్భవించారు.

గర్భస్థ శిశువునకు నాసికా రంధ్రాలు ఏర్పడిన కొంతకాలానికే కంటి రంధ్రాలు ఏర్పడతాయి. ఈ సృష్టి ప్రకరణంలో కంటినుండి సూర్యుడు పుట్టినాడంటే విరాట్‌పురుషునిలో సూర్యుడు నేత్ర సదృశుడని గ్రహించాలి.

కర్ణౌ నిరభిద్యేతామ్ - కర్ణాభ్యాం శ్రోత్రం, శ్రోత్రాద్ దిశః

తదుపరి - కర్ణరంధ్రము లేర్పడ్డాయి. వాటినుండి శ్రవణశక్తి పుట్టింది. ఆ శ్రవణశక్తినుండి దిశలేర్పడ్డాయి.

గర్భస్థ పిండములో కంటిరంధ్రాల తదుపరి చెవిరంధ్రాలు ఏర్పడి శ్రవణేంద్రియం రూపుదిద్దుకుంటుంది. శ్రవణేంద్రియం ద్వారానే మానవులకు దిక్కుల జ్ఞానం కలుగుతుంది. పైన, క్రింద, ఎడమవైపు, కుడివైపు, తిన్నగా, వంకరగా, నిలువుగా, సమానంగా అనే జ్ఞానమంతా మనకు చెవులలో ఉండే లేబిరింత్ అనే పొరలవల్ల కలుగుతుంది. క్రీ.శ. 1925 వరకు ఈ విషయం ఆధునిక విజ్ఞానానికి తెలియదు. మేక్‌నాలీ అనే శాస్త్రజ్ఞుడు ఈ విషయం గుర్తించాడు. అనంతరం రాస్ అండ్ ట్రైట్ అనే శాస్త్రజ్ఞు లిరువురు ఈ విషయంలో విస్తృతంగా పరిశోధనలు చేసి 1936లో ఈ విషయం సత్యమని ప్రకటించారు.

లేబిరింత్ మూడు అర్ధవలయాకార కాలువలతో నిర్మింపబడిన పుఱ్ఱెలోని ఎముక భాగం. ఇది 20mm×15mm వైశాల్యం కలిగి ఉంటుంది. శరీర విన్యాసాలలో వీటిలోని ద్రవపదార్థం కదిలినప్పుడు అందలి ప్రత్యేక నరాగ్రాలద్వారా శరీర భంగిమ మెదడులోని సెరిబెల్లమునకు చేరుతుంది. దానికి అనుగుణంగా శరీరం ఎలా ఉండాలో సెరిబెల్లం శాసిస్తుంది. అందువల్ల మనం అదుపుతప్పి పడిపోకుండా ఉండగలుగుతున్నాము. పరిశోధనకొరకు కొన్ని జంతువులలో లేబిరింత్ తొలగించి చూసారు. అప్పుడు వాటికి దిక్కుల జ్ఞానం కలుగక యిబ్బంది పడ్డాయి. 1925 - 1936 సంవత్సరాల మధ్య ఆధునిక విజ్ఞానవేత్తలకు కలిగిన

ఈ దిక్కులకు చెందిన జ్ఞానం పదివేల సంవత్సరాలకు పూర్వంవాడయిన ఐతరఋషి కలిగి ఉన్నట్లుగా ఆయన ఈ రచనవల్ల తెలుస్తున్నది. అందుచేతనే మన ప్రాచీనవిజ్ఞానం ఆధునికవిజ్ఞాన వికాసానికి దోహద పడుతుందని పెద్దలంటారు.

ఇక్కడ ఈ సృష్టి ప్రకరణంలో క్రింద, పైన; కుడి,ఎడమ మొదలగు దిక్కుల జ్ఞానం విరాట్పురుషుని చెవులనుండి కలిగినట్లు గ్రహించాలి. లేదా దిక్కుల జ్ఞానం చెవులుగా ఉంటుందని గ్రహించాలి. అంతేకాని దిక్కులు క్రొత్తగా పుడతాయని కాదు. దిక్కు అనే శాస్త్రీయ పదమునకు నేటి పరిభాషలో స్థలము (స్పేస్) అని అర్థం చెప్పవచ్చు. అది క్రొత్తగా పుట్టదు. అది అనాది. అందులోనే మిగిలిన పదార్థాలన్నీ ఉంటాయి. ఇప్పుడు మనం వ్యవహారం కోసం సూర్య్య డుదయించే దిశను తూర్పు అనీ, అస్తమించే దిశను పడమట యనీ.... ఈ విధంగా వ్యవహరిస్తున్నాము. సూర్యుడు పుట్టకముందు ఏది యే దిక్కు ?

కర్ణ శ్రోత్ర దిశల అనంతరం-

**త్వక్ నిరభిద్యత - త్వచో లోమాని,**
**లోమభ్యః ఓషధి వనస్పతయః**

విరాట్ పురుషునకు చర్మమేర్పడింది. చర్మాన్నుండి రోమాలు (వెంద్రుకలు)- ఆ వెంద్రుకలనుండి ఓషధి వనస్పతులు ఏర్పడ్డాయి.

గర్భస్థ పిండానికి కన్నులు చెవులు ఏర్పడిన పిమ్మట చర్మమేర్పడుతుంది. తదుపరి వెంద్రుక లేర్పడతాయి. అట్లే విరాట్పురుషునకు చర్మ సదృశంగా భూమి ఏర్పడి, దానిపై రోమ సదృశంగా ఓషధి వనస్పతు లేర్పడినట్లు గ్రహించాలి. లేదా భూమి చర్మముగాను, ఓషధి వనస్పతులు వెంద్రుకలుగాను ఉంటాయని గ్రహించాలి. తదుపరి -

**హృదయం నిరభిద్యత - హృదయాత్ మనః మనసః చంద్రమా**

హృదయమేర్పడి దానినుండి మనస్సు - మనస్సునుండి చంద్రుడు ఉద్భవించారు.

గర్భస్థ పిండములో చర్మ రోమము లేర్పడిన తదుపరి హృదయం, అనంతరం

నాభి ఏర్పడుతాయి. ఐతరేయోపనిషత్తు క్రమాన్ననుసరించి పిండానికి రెండవ నెలచివర గుండె ఏర్పడుతుంది.

1972 డిసెంబరు వరకు ఆధునిక వైద్యులు ఐదవ మాసములో గుండె ఏర్పడుతుందని నమ్ముతూ వచ్చారు. కాని, 1972లో డా. రాబిన్ సన్ (క్వీన్ మేరీ హాస్పిటల్, గ్లాస్‌గో, ఇంగ్లాండు) గారు చేసిన పరిశోధనలతో గర్భస్థ శిశువునకు 7 లేదా 8 వారాలలోనే గుండె ఏర్పడుతున్నట్లు గుర్తించారు. ఆయన డయాసోనార్ అనే పరికరం ద్వారా గుండె శబ్దాలను రికార్డుచేసి చూపించారు. 10,000 సంవత్సరాలకు పూర్వం ఐతరఋషి ఏ పరికరాల ద్వారా ఈ విషయం తెలిసికున్నాడో తెలియదు. నాభి కన్న పూర్వమే హృదయ మేర్పడుతుందని వ్రాసాడు. దానిని అధునిక వైద్యులు ఇటీవల తెలుసుకున్నారు.

'హృదయాత్ మనః, మనసః చంద్రమా' అని ఈ ఋషి కథనం. 'చంద్రమా మనసో జాతః' అని వేద కథనం. వీటి భావ మేమంటే మనస్సు, చంద్రుడు విరాట్ పురుషునిలో హృదయం వలె ఉంటాయని.

ఇక్కడ గుర్తించవలసిన మరియొక విషయమేమంటే సూర్యుని (ఆదిత్యుని) జననం కంటినుండి, చంద్రుని జననం మనస్సునుండి యని ఋషి వాక్కు. ఆధ్యాత్మికార్థంలో విశ్వంలో సూర్యుడు నేత్ర సదృశంగాను, చంద్రుడు మనః సదృశుడుగాను ఉంటారని భావం. ఆదిభౌతికంగా (భౌతికవిజ్ఞాన పరంగా) ఆలోచిస్తే సూర్యచంద్రుల జననం ఒకే పదార్థంనుండికాక వేరువేరు పదార్థాలనుండి జరిగినట్లు అర్థమౌతోంది. కొంతకాలం క్రిందట చంద్రునినుండి తీసుకురాబడిన మట్టిని పరిశీలించిన వైజ్ఞానికులు ఆ మట్టి ఈ సూర్యకుటుంబానికి చెందినదిగా లేదంటున్నారు.

చంద్రజననం గురించి శాస్త్రవేత్తలలో భిన్న భిన్న అభిప్రాయాలున్నాయి. చాలామంది అనుకునేటట్లుగా చంద్రుడు భూమినుండి విడిపోయిన ముక్క కాదంటున్నారు. విశ్వాంతరాళంనుండి ఏదో పెద్ద ఉల్క ఏ కారణం చేతనో భూమి చెంతకు రావటం, భూమికి ఉపగ్రహంగా మారిపోవటం జరిగాయని కొందరభిప్రాయం. చంద్రుడు భూమిచుట్టూ తిరుగుచున్నాడనేది పూర్తిగా నిజం

కాదని కొందరంటారు. నిజానికి చంద్రుడు, భూమి తమ ఉమ్మడి గరిమనాభి (కామన్ సెంటర్ ఆఫ్ గ్రావిటీ) చుట్టూ తిరుగుతున్నాయని వారంటారు. ఆ కేంద్రం భూమి ఉపరితలానికి 1063 మైళ్ళ క్రిందుగా భూగర్భంలోపల ఉన్నదట.

మన బ్రాహ్మణ ఆరణ్యకాలలోను, పురాణాలలోను కూడా చంద్ర జననం గురించి రకరకాల అభిప్రాయాలున్నాయి. 'ఋక్ష చంద్ర గ్రహాః సర్వే విజ్ఞేయోః సూర్య సంభవాః' – నక్షత్ర చంద్ర గ్రహాదులన్నీ సూర్యుని నుండి పుట్టినవే" నని వాయుపురాణం (50–99–53–28) చెబితే, "శీతరశ్మిగల చంద్రుడు కృత్తికా నక్షత్రాలనుండి పుట్టా"డని బ్రహ్మాండపురాణం (2–24–230) చెబుతుంది. 'చన్ద్రమా వై అపాం పుష్పమ్' చంద్రుడు నిశ్చయముగా నీటియొక్క పుష్ప' మని తైత్తరీయ బ్రాహ్మణం చెబితే' 'అపాం పుష్పమసి' – ఓ సోముడా (చంద్రుడా) నీవు ఆపః పుష్పమువు' అని తాండ్య బ్రాహ్మణం చెబుతుంది. ఈ విధంగా ఏ గ్రంథాలేమి చెప్పినా, అవి మనకు అర్థంకాకపోయినా సూర్య చంద్రుల ఉత్పత్తి ఏక పదార్థంతో కాక వేరు వేరు పదార్థాలతో నని అవగతమౌతున్నది.

ఇక్కడ భౌతికసృష్టి ప్రకరణంలో చంద్రుడు విశ్వపురుషుని మనస్సుకు సంకేతమనీ, ఆ మనస్సు విరాట్ పురుషుని హృదయస్థానమనీ గ్రహించాలి.

హృదయ మనో చంద్రుల అనంతరం –
**నాభిర్ నిరభిద్యత – నాభ్యా అపానః, – అపానాత్ మృత్యుః**

నాభి ఏర్పడింది. నాభినుండి అపానము. ఆ యపానమునుండి మృత్యువు ఉత్పన్నమయ్యాయి.

గర్భస్థ పిండమునకు రెండవ నెలలో నాభిత్రాడు ఏర్పడుతుంది. అప్పటినుండే శిశువులో అపానము, మృత్యువు ఏర్పడతాయని ఈ ఋషి కథనం. ఇది ఎంతవరకు వైజ్ఞానికమో ఆలోచిద్దాము.

నాభిత్రాడు ఏర్పడక పూర్వం పిండంలోని కణాలన్నీ అత్యంత వేగంగా రెట్టింపు రెట్టింపుగా అవుతూ పెరుగుతాయి. ప్రతికణం స్వతంత్రంగానే ఆహారాన్నీ, ఆక్సిజన్‌ను స్వీకరిస్తాయి. ప్రతీకణం స్వతంత్రంగానే జీవిస్తూ రెట్టింపగుచూ (మల్టీప్లై

అగుచూ) పెరుగతాయి. అందుచేత అప్పుడు ఏ కణానికీ మృత్యువుండదు. రెండవ నెలలో బొడ్డు, బొడ్డుత్రాడు ఏర్పడతాయి. అప్పటినుండి పిండంలోని ప్రతీకణం ఆహారానికీ, ఆక్సిజన్‌కి తల్లి రక్తంపైననే ఆధారపడి ఉంటుంది. అందుచే పిండంలోని కణాలన్నీ నాభిపైన, నాభిత్రాటిపైన ఆధారపడి ఉంటాయి. ఏ కారణంచేతనైనా బొడ్డుత్రాటిలో అడ్డంకులు ఏర్పడినా లేదా అది మెలితిరిగి మడతబడి రక్తసరఫరా ఆగిపోయినా ఆహార ఆక్సిజన్ లందక కణాలన్నీ మరణిస్తాయి. అందుచేతనే మన ఐతరఋషి నాభినుండి అపానమృత్యువులు పుట్టాయన్నాడు.

ఇంతేగాక, బొడ్డుత్రాడు ఏర్పడే సమయానికి పిండంలో కణాల వర్గీకరణ జరిగిపోతుంది. అంటే ఎముక కణాలు, మాంసకణాలు, రక్తకణాలు, గుండె మెదడు ఊపిరితిత్తులు మలమూత్రావయవాదులకు చెందిన వేరువేరు కణాలుగా వర్గీకరింపబడిపోతాయి. అందుచే అవి స్వతంత్రంగా ఆహారఆక్సిజన్‌లను సంపాదించుకోలేవు. తమవంటి నూతన కణాలను నిర్మించగలవేకాని వేరు వర్గానికి చెందిన కణాలను నిర్మించలేవు. ప్రారంభిక పిండకణాలు మరొక కణంపై ఆధారపడకుండా స్వతంత్రంగా జీవిస్తూ పెరుగగలవు. నాభి ఏర్పడినప్పటి నుండి ఈ ప్రకియ ఆగిపోతుంది. కనుక మన మహర్షి నాభినుండి అపానమృత్యువులు ఏర్పడ్డాయన్నాడు. ఈ సందర్భంలో అపాన మంటే ఏమిటోకూడా తెలిసికొందాము.

మనం గాలి పీల్చుకుని స్వీకరించేది ఒక్క ఆక్సిజన్‌ని మాత్రమే అయినా అది మన శరీరంలో ఐదు ముఖ్యమైన పనులను చేస్తుంది. కనుక, ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానా లని ప్రాణాలను ఐదుగా లెక్కించారు మన ఋషులు. వీటిలో అపానవాయువు మనం తీసుకునే ఆహారాన్ని జీర్ణంచేసి వ్యర్థపదార్థాన్ని బహిష్కరిస్తూ మన శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుతుంది. అపానవాయువు మనం తీసుకున్న ఆహారాన్ని అణువులుగా మార్చివేసి శరీరాన్ని పోషిస్తున్నట్లే ఆహారం తీసుకోని సమయంలో (స్టార్వేషన్, ఫాస్టింగ్ మొదలైన సమయాలలో) శరీరంలో నిలువ ఉన్న క్రొవ్వు మొదలైన వాటిని గ్రహించి (కరిగించి) ఆహారంగా మార్చి శరీరాన్ని జీవింపజేస్తుంది. క్రమంగా నిల్వలు సమాప్తమైతే శరీరధాతువులనే దహించి ఆహారంగా మారుస్తూ శరీరాన్ని జీవింపచేయటానికే నిరంతరం ప్రయత్నిస్తుంది.

చివరికి మృత్యువును కలిగిస్తుంది. ఈ ప్రక్రియ బొడ్డుత్రాడు ఏర్పడినప్పటినుండే కలుగుతుందికనుక మన ఋషి నాభినుండి అపానం పుట్టిందనీ, ఆ అపానం ఆహారం దొరకకపోతే శరీరధాతువులనే చంపివేస్తూ మృత్యుకారకమౌతుందనీ బోధిస్తున్నాడు.

'అపానం' అంటే అర్థం: అప = క్రిందకు లేదా బయటకు ఆన= తీసుకుపోవడం. ఇది నోటి కందిన ఆహారాన్ని క్రమంగా జీర్ణకోశం, డుయోడినం, చిన్నప్రేగులు, పెద్దప్రేగుల ద్వారా క్రిందకు నడిపిస్తూ మలాన్ని విసర్జిస్తుంది. మూత్ర స్వేదాదులను కూడా బయటకు త్రోసివేస్తుంది. మృత్యుసమయంలో జీవుడిని, సూక్ష్మకారణ శరీరాలను అపానమే బయటకు త్రోసివేస్తుందని యోగులంటారు. కనుక అపానంనుండి మృత్యువు పుట్టిందని చెప్పబడింది. దీనిని మనం ఆధునిక విజ్ఞానంతో నిరూపించలేకపోయినా ఏదో అదృశ్యశక్తి జీవకణాలను, ప్రాణులను మృత్యువు వైపు తీసుకుపోతున్నదనేది సత్యం. జరామృత్యువులు ఏవో హార్మోనులవల్ల కలుగుతున్నాయనీ, వాటిని నిరోధిస్తే అవి దూరమౌతాయని కొందరభిప్రాయం. కాని, 'జాతస్య హి ధ్రువో మృత్యుః'- పుట్టినది మరణించక తప్పదనేది ప్రకృతి నియమం. అనంతరం -

శిశ్నం నిరభిద్యత - శిశ్నాద్ రేత ః, రేతసః ఆపః

విరాట్ పురుషునకు నాభి తదుపరి జననేంద్రియం పుట్టింది. దానినుండి రేతస్సు - రేతస్సునుండి ఆపః (పునరుత్పాదక శక్తి) ఉద్భవించాయి.

గర్భస్థ పిండములో నాభి తరువాతనే శిశ్నం ప్రకటమౌతుంది. సామాన్యంగా రెండవ నెల చివరిలో బొడ్డుత్రాడు ఏర్పడుతుంది. మూడవ నెలలో జననేంద్రియ మేర్పడుతుంది. కాలాంతరంలో స్త్రీ పురుషులలో రజోవీర్యా లేర్పడటం, మరొక ప్రాణికి జన్మనివ్వటం జరుగుతుంది.

పై కారణంవల్ల స్త్రీ పురుషులలోని ఉత్పాదకశక్తిని అలంకారికంగా విరాట్ పురుషుని శిశ్నంగా - జననేంద్రియంగా పేర్కొనబడింది. రేతసః ఆపః - రేతస్సునుండి ఆపస్సు అంటే - ప్రాణు లేవిధంగా వీర్యంనుండి పుట్టి మరల

వీర్యాన్ని ఉత్పన్నం చేస్తాయో ; అట్లే ఆపస్సునుండి పుట్టిన విరాట్‌పురుషుడు మరల ఆపస్సును ఉత్పన్నం చేస్తుంటాడని ఈ ఐతరఋషి కల్పన.

## ద్వితీయ ఖండము

ఐతరేయోపనిషత్తులో మూడధ్యాయాలున్నాయి. అందు మొదటి అధ్యాయం మూడు భాగాలుగా (మూడు ఖండాలుగా) విభజింపబడింది. ఇందు మొదటి ఖండంలోని విషయం ఆలంకారికంగా వర్ణింపబడగా ద్వితీయ తృతీయ ఖండాలు కథానికలుగా కల్పింపబడ్డాయి. గంభీరమైన శాస్త్రీయ విషయాలను సామాన్యులకు బోధించేటప్పుడు వారి బుద్ధి అలసిపోకుండా పెద్దలు పంచతంత్ర కథలవలె బోధిస్తారు. ఐతరఋషికూడా ఆ పద్ధతినే అనుసరించాడు.

విరాట్‌పురుషుని అవయవాలనుండి పుట్టిన అగ్నివాయురాదిత్యాది దేవతలను ఆకలి దప్పికలతో సంయుక్తం చేసాడు ప్రజాపతి. అంతట ఆ దేవతలు మా ఆకలి దప్పికలను తీర్చుకోవటానికి మంచి ఆయతనాన్ని (యింటిని) చూపించుమని ప్రజాపతిని ప్రార్థించాయి.

ప్రజాపతి వాటిపై దయతలచి ఒక గోవును సృజించి దీనిలో ప్రవేశించి మీ ఆకలి దప్పికలను తీర్చుకోండన్నాడు. దానిని పరికించిన దేవతలు ఇది (ఈ శరీరం) మాకు సరిపోదన్నాయి. అంతట ప్రజాపతి ఒక అశ్వమును సృజించి దీనిలో ప్రవేశించమన్నాడు. అదియును మాకు సరిపోదన్నాయి దేవతలు. అనంతరం ప్రజాపతి బాగుగా యోచించి ఒక మానవ శరీరాన్ని రచించి 'ఇది మీకు సరిపోతుందా?' అన్నాడు. దానిని బాగుగా పరిశీలించిన దేవతలు సంతృప్తిని చెంది 'బాగు, బాగు, ఇది మాకు అన్ని విధాలా అనుకూలంగా ఉంద'న్నాయి. అయితే మీరిందులో ప్రవేశించి మీకు తగిన స్థానాలలో నివసించండన్నాడు.

అగ్నిర్ వాగ్ భూత్వా ముఖం ప్రావిశత్
వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్
ఆదిత్య శ్చక్షుర్ భూత్వా ౨ క్షిణీ ప్రావిశత్
దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్

ఓషధి వనస్పతయో లోమాని భూత్వా త్వచం ప్రావిశన్
చంద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశత్
మృత్యు రపానో భూత్వా నాభిం ప్రావిశత్
ఆపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్" (2-4)

అంతట అగ్నివాయువాది దేవతలు పైవిధంగా మానవ శరీరంలో ప్రవేశించి వాటికి తగిన స్థానాలలో స్థిరపడ్డాయి. ఇచట గమనించవలసిన విషయమేమంటే - పూర్వఖండంలో విరాట్‌పురుషుని ముఖంనుండి (నోటినుండి) వాక్కుపుట్టిందనీ, ఆ వాక్కునుండి అగ్నిపుట్టిందని చెప్పబడింది. ఇచట మరల అగ్నిదేవత వాక్రూపం ధరించి అది దేనినుండి పుట్టిందో ఆ ముఖంలో (నోటిలో) ప్రవేశించిందని ఋషి చెప్పుచున్నాడు. ఇట్లే వాయ్వాదిత్యాది దేవతల గురించియు చెప్పుచున్నాడు. దీని భావమేమంటే - ఏ పదార్థంనుండి ఏది పుడుతుందో అది నశించినపుడు తిరిగి ఆ రూపంలోకి మారిపోతుంది. మట్టినుండి కుండపుట్టి కాలాంతరంలో తిరిగి మట్టిగా మారిపోయినట్లు. దీనిని దార్శనిక భాషలో కార్యకారణభావ సంబంధ మంటారు. మనకు కనబడే ఈ ప్రపంచంకూడా కాలాంతరంలో దాని కారణమైన మూల ప్రకృతిలో కలిసిపోతుంది. నేటి వైజ్ఞానికులు ఆ మూల ప్రకృతి ఏమిటో తెలిసికొవటానికే ప్రయత్నిస్తున్నారు. వారి భాషలో మూలప్రకృతిని కాస్మిక్‌సెల్స్ అంటున్నారు. మన ఋషులు దానిని సత్త్వరజస్తమస్సు లను మూడు రకాల సూక్ష్మాణువుల సామ్యావస్థ అన్నారు.

అనంతర వాక్యంలో మహర్షి ఆకలి దప్పికలను కూడా దేవతలుగా కల్పించి అవి మాకు స్థానము చూపుమని ప్రజాపతిని ప్రార్థించినట్లు వ్రాసాడు. దానికి ప్రజాపతి సమాధానం చెబుతూ - "అన్ని దేవతలలోను మీకు స్థానం కల్పిస్తున్నాను. మీరు అన్ని దేవతలకు భాగస్వాములే" నన్నాడు. అందుచేతనే మనకు ఆకలిదప్పికలు కలిగినప్పుడు అన్ని అవయవాలు శక్తిహీనములౌతాయి. ఆహారపానీయాలు తీసుకోగానే మరల అవి శక్తిని పుంజుకుంటాయి. పరిశీలించి చూస్తే ఆకలిదప్పికలు పదార్థాలు కావు. అయినా అవి ప్రాణులను బాధిస్తాయి. కనుక వాటినికూడా దేవతలుగా పేర్కొన్నాడు ఈ ఋషి.

## తృతీయ ఖండము

ప్రజాపతియైన పరమేశ్వరుడు ఆకలిదప్పికలను సృజించి వాటికి అన్ని దేవతలలోను భాగస్వామ్య మిడి, ఆకలిదప్పికలకు విషయముగా అన్నమును సృజించ సంకల్పించాడు. అతడు ఆపస్సును (జలమును) తపింపగా అన్నముద్భవించింది. కాని, ఆ మానవశరీరములోని దేవతలకు భయపడి పెద్దగా ధ్వనిచేస్తూ దూరంగా పారిపోవడానికి యత్నించింది. ఆ విధంగా పారిపోతున్న అన్నాన్ని వాక్కు గ్రహించలేకపోయింది. వాక్కుయేకాక మిగిలిన దేవతలుకూడా గ్రహింపలేక పోయాయి. చివరకు అపానవాయువు దానిని గ్రహించగలిగింది. కేవలం గ్రహించటమే కాక అది అన్నాన్ని జీర్ణంచేసి మిగిలిన దేవతలనన్నిటిని పోషిస్తున్నది.

ఇచట ఋషి భావమేమంటే - చక్షుశ్శ్రోత్రాది దేవతలు అన్నాన్ని దర్శించగలవు, స్పర్శించగలవు, స్మరించగలవే కాని గ్రహించి(తిని) క్షుత్పిపాసలను శాంతింపచేసుకోలేవు. ఆ శక్తి ఒక్క అపానమునకే ఉంది. పూర్వప్రకరణంలో విరాట్పురుషుని నోటినుండి పుట్టిన అగ్ని మరల వాక్శక్తిగా మారి మానవుని నోటిలో ప్రవేశించిందని చెప్పబడింది. ఆ అగ్ని కేవలం వాక్శక్తిగానే కాక జీర్ణకోశంలో ప్రవేశించి జఠరాగ్నిగా కూడా ఉంది. ఆ అగ్ని అపానవాయువులే ఆహారాన్ని జీర్ణం చేసి అన్ని దేవతలను పోషిస్తున్నాయి. ఇది శరీరంలో జరిగే ప్రక్రియ. అట్లే ప్రపంచంలోని దేవతలను పోషించడానికి యజ్ఞం సృజించబడింది. యజ్ఞంలో (అగ్నిహోత్రంలో) వేసిన ఆహుతులు వాయువులో కలిసి మిగిలిన దేవతల నన్నిటిని పోషిస్తాయి. (ఈ విషయమును వివరంగా తెలిసికొనగోరువారు మాచే ప్రచురింపబడిన 'అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము, 'అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ' అను పుస్తకములు చదువ గోరుచున్నాము).

ప్రజాపతి అద్భుతమైన మానవ శరీరాన్ని సృజించి దీనిలో భోక్త లేకున్న ప్రయోజనమేమని యెంచి భోక్తను (జీవుని) ప్రవేశపెట్ట సంకల్పించాడు. మీదినుండి ప్రవేశపెట్టాలా? క్రిందినుండి ప్రవేశపెట్టాలా? అనే మీమాంస ఏర్పడింది. మీదినుండి ప్రవేశపెట్టటమే ఉత్తమం కనుక శిరస్సును విదార్యంచేసి (చీల్చి) జీవుని శరీరంలో ప్రవేశపెట్టాడు. అదే శిశువులలో మాడుగా (మెత్తటి భాగంగా)

గోచరిస్తుంది. యోగులు శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళేటప్పుడు అచ్చటినుండే బయటకువెళ్ళి బ్రహ్మాను (ముక్తిని) పొందుతారట. అందుచే బ్రహ్మారంధ్రమని దీనికి పేరు. ఇంతేగాక, ముక్తిప్రాప్తి యంటే బ్రహ్మానందప్రాప్తియే కనుక దీనికి 'నాందన'మని మరియొక పేరు.

బ్రహ్మారంధ్రముగుండా శరీరంలోనికి ప్రవేశించిన జీవునకు మూడు స్థానాలు, మూడు అవస్థలు ఉంటాయంటాడు ఈ ఋషి. అవి – 1.జాగ్రదావస్థ (ఈ అవస్థలో జీవుడు నేత్రస్థానంలో ఉంటాడు). 2. స్వప్నావస్థ (దీనిలో కంఠస్థానంలో ఉంటాడు). 3. సుషుప్తావస్థ (గాఢనిద్రలో జీవుడు హృదయస్థానంలో ఉంటాడు).

జీవుడు ఈ శరీరంలో పై మూడు అవస్థలలో ఏదేని ఒక అవస్థలో ఎప్పుడూ బంధింపబడి ఉంటాడు. అట్టి జీవునికి వేదాది శాస్త్రాధ్యయనమువల్లనో, సత్సంగాదులవలననో వివేకము జాగృతమై తాను శరీరానికన్న భిన్నమైన వాడినిగా గుర్తిస్తాడు. తనవలెనే అన్ని ప్రాణులలోను జీవుడున్నట్లు గుర్తించి సాధన చెయ్యగా చెయ్యగా తన కభిముఖంగా పూర్ణమై వ్యాపకమైయున్న పరబ్రహ్మ తత్వాన్ని దర్శించి ఆశ్చర్యంతో నిశ్చేష్టుడైపోతాడు. పరితుష్టిని – అత్యంత తృప్తిని పొందుతాడు. ఆ ఆనందము, ఆ తృప్తి మాటలతో వర్ణించలేనంత గొప్పది. దానికి ఈ ఋషి 'ఇదంద్ర'మని పేరుపెట్టాడు. దీనిని మరింత సంక్షిప్తంచేసి 'ఇంద్రమ్' అని అంటాడు. ఎందుచేతనంటే దేవతలు పరోక్షప్రియులు.

## ద్వితీయాధ్యాయము

ఐతరేయోపనిషత్తులోని ద్వితీయ తృతీయాధ్యాయాలు చిన్నవి. ద్వితీయాధ్యాయంలో 6 వాక్యాలు మాత్రమే ఉన్నాయి. ఇవి జీవునకు ఒక జన్మలోనే మూడు జన్మలు ఇమిడి ఉన్నట్లు చెబుతాయి. జీవుల జన్మచక్రాల గురించి ఋషులలో చాలా అభిప్రాయాలున్నాయి. ఈ ఋషి అభిప్రాయమేమంటే – పూర్వ శరీరాన్ని వదిలిన జీవుడు ముందుగా పురుషుని శరీరంలోచేరి అతని వీర్యంలో స్థిరపడతాడు. ఇది అతనికి మొదటి జన్మ. అనంతరం ఆ పురుషుడు తన వీర్యాన్ని అతని భార్య గర్భంలో విడిచినపుడు జీవుడు తల్లి గర్భాశయంలో స్థిరపడి అండముగా పిండముగా

పెరిగి నవమాసాలానంతరం శిశువుగా తల్లి గర్భం నుండి భూమిపైకి వస్తాడు. ఇది జీవునకు రెండవ జన్మ.

తల్లి గర్భం నుండి ద్వితీయ జన్మగా బయటపడిన అతడు పెరిగి పెద్దవాడై యువకుడౌతాడు. అతడు వృద్ధుడై మరణించక ముందే తన వీర్యమును తన భార్య యందుంచుటచే పుత్రరూపమున ఆమె గర్భములో ఉంటాడు కనుక అది అతనికి తృతీయ జన్మ (మూడవ జన్మ).

ఈ కథనమంతా జీవుల కనేక జన్మలు కలుగునని చెప్పుటకొరకే. జీవుడు అనాది. అతనికి ఆదిలేదు. అంటే ఎప్పుడును అది క్రొత్తగా పుట్టియుండలేదు. కనుక అది ఎప్పటికిని మరణించదు. అంటే లేకుండా పోదు. కాని, ఒక శరీరాన్ని విడిచి మరొక శరీరాన్ని పొందుతూ ఈ సంసార సాగరంలో తిరుగుతూ ఉంటుంది. ఏ శరీరాన్ని పొందితే అదే తన స్వరూపంగా భావించి అవిద్యతోకూడి సుఖదుఃఖాల ననుభవిస్తుంది. కాలాంతరంలో వివేకోదయమై తన స్వరూపం అవగతమైనపుడు సాధనచేసి ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతుంది. మరింతగా సాధనచేస్తే తనలో వ్యాపించియున్న పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది. అప్పుడు ఆ జీవునకు ముక్తి కలుగుతుంది. అంటే సంసార చక్రబంధనాన్నుండి–జననమరణ చక్రబంధనాన్నుండి విముక్తిని పొంది పరమానంద స్వరూప పరమాత్మలో 100 బ్రహ్మవర్షములు అనగా 31,10,40,00,00,00,000 – 31 నీలముల, 10 ఖర్వముల, 40 అర్బుదముల కాలం ఆనందాన్ని పొందుతూ స్వేచ్ఛగా విహరిస్తుంది.

"తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాః
పరిముచ్యంతి సర్వే" (ముండకోపనిషత్తు 3-2-6)

అని చెప్పినట్లు పరాంతకాలం పూర్తయిన తదుపరి సామాన్య మానవునిగా ఈ సంసారంలోనికి తిరిగి వస్తుంది. మరల జననమరణరూప చక్రబంధనంలో తిరుగుతూ ఉంటుంది. సంక్షిప్తంగా యిదే వేదం చెప్పే ముక్తి సిద్ధాంతం. భారతీయ జ్యోతిష గ్రంథాల ననుసరించి సృష్టికాలం 432 కోట్ల సంవత్సరాలు. అనంతరం యింతేకాలం ప్రళయం ఉంటుంది. ఈ సృష్టి ప్రళయాలు రెండూ కలిసి (432+432)

= 864 కోట్ల సంవత్సరాలు. ఇవి బ్రహ్మకు అహోరాత్రాలౌతాయి. అంటే రాత్రి పగలు కలిసిన ఒక దినం. అట్టి 360 దినాలు ఒక సంవత్సరం (864x360 = 3110400 కోట్ల సంవత్సరాలు). ఇట్టి 100 బ్రహ్మసంవత్సరాలు (3110400 x 100) 3,11,04,000 కోట్ల సంవత్సరాలు) మహాకల్పం. ఈ పరిమాణమే పరాంతకాలం (ముక్తికాలం).

## తృతీయాధ్యాయము

చివరి మూడవ అధ్యాయంలో కేవలం నాలుగు వాక్యాలే ఉన్నాయి. మొదటి వాక్యం అన్నీ ప్రశ్నలేకాగా మిగిలిన మూడు వాక్యాలు సమాధానాలు. అందు మొదటి వాక్యం -

"కో౽యమాత్మేతి వయ ముపాస్మహే, కతరః స ఆత్మా
యేన వా రూపం పశ్యతి, యేన వా శబ్దం శృణోతి,
యేన వా గంధా నాజిఘ్రతి, యేన వా వాచం వ్యాకరోతి
యేన వా స్వాదు చాస్వాదు చ విజానాతి ?" (1)

"ఎవరిని మనం పరమేశ్వరు డని ఉపాసించాలి? జీవ పరమాత్మ లను రెంటిలో నత డెవరు? ఎవని మూలమున జీవుడు శబ్ద స్పర్శ రూప రస గంధాదుల జ్ఞానం పొందుచున్నాడు? మాట్లాడగలుగుచున్నాడు? ఎవని మూలమున రుచులను తెలుసుకొనుచున్నాడు?" అను ప్రశ్నలను కలిగియుంది.

పై ప్రశ్నలను పరిశీలించి చూస్తే 'మనం ఎవరిని ఉపాసించాలి?' అనే ప్రశ్నలోనే మనం ఉపాసకుల మనియు, పరమేశ్వరు డుపాస్యుడనియు స్పష్టంగా తెలియుచున్నది. మనం కన్నులతో చూడగలుగుచున్నా అది పరమేశ్వరుని సహకారంతోనే. కన్నులనుగాని, కంటివెనుక నున్న నరాలను గాని, సూక్ష్మములైన మనోబుద్ధులనుగాని మనం నిర్మించుకోలేము. వాటిని నిర్మించి యిచ్చి, వాటితో చూడగలిగే శక్తి నిచ్చినవాడుకూడా పరమేశ్వరుడే. అట్లే మిగిలిన యింద్రియ శక్తుల నిచ్చినవాడును, మాట్లడగల శక్తినిచ్చినవాడును ఆయనే. అట్టి పరమేశ్వరునే మనం ఉపాసించాలని దీని భావం. రెండవ వాక్యం మరికొన్ని శక్తులను

తెలుపుతుంది.

"య దేత ద్ధృదయం మన శ్చైతత్ సంజ్ఞానమాజ్ఞానం
విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టిర్ ధృతిర్ మతిర్ మనీషా
జూతిః స్మృతిః సంకల్పః క్రతుః అసుః కామో వశ ఇతి
సర్వాణ్యే వైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతి" (2)

మనస్సుతోకూడి హృదయమందున్న జీవునకు ఇంద్రియశక్తులేగాక మరెన్నో శక్తులు పరమేశ్వరుని మూలమున కలుగుచున్నవి. సంజ్ఞాన ఆజ్ఞాన విజ్ఞాన ప్రజ్ఞాన మేధా స్మృతి సంకల్పాది శక్తులన్నియు పరమేశ్వర ప్రదత్తములే. కనుక నివియన్నియు ప్రజ్ఞానస్య నామ ధేయాని భవంతి– నిరతిశయ జ్ఞానరూపుడగు పరమేశ్వరునకు నామధేయము లగుచున్నవి.

సూర్యప్రకాశములో నేత్రము రూపమును గ్రహించ సమర్థమగునట్లు పరమేశ్వరునిచే వ్యాప్తుడైన జీవుడు పై కార్యముల నన్నింటిని చేయగలుగుచున్నాడు. కనుక నివియన్నియు పరమేశ్వరుని యునికిని తెలుపు నామములని ఈ వాక్య భావం.

"ఏష బ్రహ్మైష ఇంద్ర ఏష ప్రజాపతి రేతే సర్వేదేవా
ఇమాని చ పంచ మహాభూతాని పృథివీ వాయు రాకాశ
ఆపో జ్యోతీం ష్యేతా నీమాని చక్షుద్రమిశ్రా ణీవ బీజా
నీతరాణి చేతరాణి చాండజాని చ జారుజాని చ
స్వేదజాని చోద్భిజాని చాశ్వా గావః పురుషా హస్తినో
యత్ కిం చేదం ప్రాణి జంగమం చ పతత్రి చ యచ్చ
స్థావరం సర్వం తత్ ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం
ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ" (3)

ఈ సమస్త చరాచర జగత్తు, సమస్త స్థావరజంగమ ప్రాణులు అన్నియు ప్రజ్ఞానరూప పరమేశ్వరునిలోనే ఉన్నాయి. అతని నాయకత్వంలోనే (శాసనంలోనే) అతని ఆధారంతోనే ఉన్నాయి. కనుక 'ప్రజ్ఞానం బ్రహ్మ' ప్రజ్ఞాన స్వరూపుడైన పరమాత్మయే బ్రహ్మ – అన్నింటికన్నను గొప్పవాడు.

ప్రజ్ఞానం అంటే నిరతిశయ జ్ఞానం. జ్ఞానపరాకాష్ఠ. అతనిని మించిన జ్ఞానం మరెవ్వరికిని లేదని అర్థం. అందుచే పరమేశ్వరునకు ప్రజ్ఞాన మని పేరు. అట్టి ప్రజ్ఞానుడే బ్రహ్మ-అన్నిటికన్న గొప్పవాడు. అతనినే మనం ఉపాసించాలని భావం. అద్వైత సాంప్రదాయకులు చెప్పు ప్రజ్ఞానుడైన జీవుడే బ్రహ్మయని అర్థం కాదు.

**"స ఏతేన ప్రజ్ఞే నాత్మనా౽స్మాల్లోకా దుత్క్రమ్యా**
**ముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామా నాప్త్వా**
**అమృతః సమభవత్ సమభవత్" (4)**

ఆ జీవుడు ఈ జ్ఞానస్వరూపుడగు పరమాత్మ ద్వారమున ఈ లోకమునుండి (ఈ శరీరమునుండి) వెలువడి పరోక్షమగు పరమపదమున-ముక్తావస్థయందు సర్వకామనలను పొంది అమృతుడౌతాడు. మృత్యురహితుడౌతాడు. అంటే పరాంతకాలం వరకు జననమరణరూప చక్రబంధనాన్నుండి ముక్తుడౌతాడని అర్థం.

ఈ విధంగా ఈ ఉపనిషత్తు సృష్టికథను, ముక్తికథను సంక్షిప్తంగా చెబుతుంది. ఈ రెండును వైజ్ఞానికంగాను, హేతుబద్ధంగాను ఉన్నాయని తెలుపుటకే ఈ వ్యాఖ్యానము. వైదికసంస్కృతి వైజ్ఞానికసంస్కృతి. సర్వకాలాలలోను నిలిచి ఉండగల సత్యసిద్ధాంతాలు వైదికసిద్ధాంతాలు. వాటిని వివరించ ప్రయత్నించిన ఋషుల మేధస్సును పరిపక్వమైనదే. ఆ మేధస్సు వెనుక తపస్సు ఉంది. విత్తేషణ దారేషణ లోకేషణలకు అతీతంగా పరోపకారభావన ఉంది. అట్టి పరంపరలోనివాడే ఐతరఋషి. చిన్నదియే యైనప్పటికీ ఐతరేయోపనిషత్తులోని బ్రహ్మవిద్య బ్రహ్మాండమైనదే.

అద్వైత సాంప్రదాయకులు చెప్పే "బ్రహ్మ సత్యం, జగన్మిథ్య ; జీవో బ్రహ్మైవ నాపరః" - బ్రహ్మ సత్యం జగత్ మిథ్య, జీవుడు బ్రహ్మనే. అన్యుడు కాడు" అనే సిద్ధాంతం వేదసమ్మతంకాదు. జగత్తు స్వప్నం వంటిది కాదు. దీనిలో స్థిరమైన నియమాలున్నాయి. ప్రజ్ఞాన స్వరూపుడైన పరమాత్మచే నిర్మితమై అతనిచేతనే పాలింపబడుతున్న వాస్తవిక జగత్తు. ఇది మూల ప్రకృతితో ఏర్పడిన కార్యపదార్థం.

జీవులమైన మనకు సుఖదుఃఖాలను కలిగిస్తున్నది యిదే.

జీవుడెప్పటికినీ బ్రహ్మకాలేడు. కాడు. అది స్వతంత్ర సత్తా కలిగిన పదార్థం. దాని పరిమాణం అతి స్వలం. దాని శక్తులుకూడా పరిమితమే. అది పరమాత్మని అంశ యను మాటలును సత్యం కావు. అఖండమైన పరమాత్మ ఖండిత మెట్లవుతాడు ? ఎవరు దానిని ఖండించారు ? సర్వవ్యాపకమైన పదార్థం ముక్కలు ముక్కలుగా ఎట్లవుతుంది ? సర్వజ్ఞుడైన పరమాత్మ అజ్ఞాని ఎట్లవుతాడు?....... ఈ విధంగా అంతులేనన్ని ప్రశ్నలొస్తాయి. కనుక యిది సత్యంకాదు.

ఇందలి సిద్ధాంతాలను వివరంగా తెలిసికొనగోరువారు మహర్షి దయానంద విరచిత 'సత్యార్థప్రకాశం' చదువగోరుచున్నాము. గ్రంథవిస్తరణ భీతిచే నీ గ్రంథము నింతటితో ముగించుచున్నాము.

శమితి ఓ3మ్

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స(40=00), వేదాలలో జలచికిత్స (20=00), వైదిక క్రాంతి పథం(15=00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము(15=00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రి) (20=00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (15=00), వైదిక వైజ్ఞానిక సంస్కృతి(10=00), మావన ధర్మము (10=00), అశ్వినీ దేవతలు(20=00) సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనలు(20=00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30=00), గంగాధర శివుడు (5=00), గోమాత (7=00), గాయత్రీ మహిమ(6=00), జననీ-జన్మభూమి(5=00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షిదయానందుడు (4=00), దైనిక అగ్నిహోత్ర విధి (4=00), మన ఇతిహాసం,(50=00), మన వేదశాస్త్రాల పరిచయం (ముద్రణలో), పురుషోత్తముడు శ్రీరాముడు (14=00), వేదములలో విజ్ఞాన బీజాలు (10=00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00), వైదిక వివాహ వైశిష్ట్యము(8=00), చతుర్దశ భువనములు (3=00), ధర్మవీర్ పం. లేఖరాం(3=00), మహర్షి మనువుపై విరోధమెందుకు (3=00), వేదాలలో అప్సరస గంధర్వులు (2=50), యజ్ఞోపవీత వైశిష్ట్యము(2=00), లక్ష్మీసూక్తము (2=00), శాంతిప్రార్థన (2=00), దిగ్రేట్ గాయత్రీ(2=00), వైదిక అర్థనీతి (2=00), చాణక్యనీతి (40=00), అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ(20=00), బ్రహ్మచర్య విజ్ఞానము (15=00), శ్రీ దయానంద హృదయము (12=00), స్వరాజ్యసంగ్రామములో ఆర్యసమాజము(8=00), సత్యధర్మవిచారణ(6=00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10=00).

AITEREYA UPNISHAD SRUSHTI KATHA
Gayatri Series No. 44 Rs. 10/-



విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే ।
ఇన్ద్రస్య యుజ్యః సఖా ॥ ఋగ్వేదము (1-2-7)

## PRAYER

O Human beings ! Behold Carefully the All - Pervading God's divine works of creation, preservation, sustenance, extinction etc. of this wonderful universe. It is though His Kindness and power that we bodied souls have become able to observe vows of ceiibacy, truth and obedience to His commandments, for He alone is the proper and worthy friend of the soul that endowed with organs of senses and action, is the doer and reaper of fruits of his actions. No one else can be human being's such friend, for He pervades even our inner souls and knows even our intentions and thoughts, and no one else except him can be our well-wisher and well doer. Hence we all should keep friendship with God.

- By **Maharshi Dayananda Saraswati**
(Aryabhivinaya. 2-23)

Published by :
Gayatri Ashram Trust
Vyas Vedic Seva Samaj, Medibavi,
Seetaphalmandi, Secunderabad - 500 061.